JAGATI Rs. 2-00 Dec. 1985

31st Year of Publication




డిసెంబరు - 1985

మానవుడు యీనాడు ప్రపంచాన్ని నాశనం చేసే శక్తినే కాదు, పునర్నిర్మించే శక్తిని కూడా కలిగివున్నాడు. విజ్ఞానశాస్త్ర, సాంకేతిక శాస్త్ర పరికరాలు అతని చేతిలో ఉన్నాయి. నక్షత్ర మండలాలకు కూడా పోతున్నాడు. ప్రపంచమంతటా ఉన్న సామాన్య ప్రజల సమష్టి సంకల్పానికి అందకుండా వుండనిది కాదు ప్రపంచశాంతి..... రాజకీయపు కూటాలను, అధిగమించి మన అలీనదేశాలు విభిన్న జాతుల మధ్య స్నేహసంబంధాల స్థాపనను అవిశ్రాంతంగా బలపరుస్తున్నాయి. అలీన వర్ధమానదేశాలకు చెందిన మనం, ఆర్థిక సంఘర్షణలకు దారితీసే భావాలను అడ్డగిస్తాము. వాటికి మనం ప్రతికూలురం..... ప్రపంచ ప్రజలు యావన్మందీ యుద్ధం ఎంత దారుణమైనదో, ఘోరమైనదో చూశారు. ఈనాడు సామాన్య ప్రజల వాణి యుద్ధానికి వ్యతిరేకంగా సర్వే సర్వత్రా ధ్వనిస్తున్నది.

—ఇందిరా గాంధీ

'జగతి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 – సం॥ చందా రు. 20–00. 2 సం॥లకు 38-00 5 సం॥లకు రు. 85-00. జీవితచందా రు. 300-00 విదేశాలకు 2 సం॥లకు రు. 85-00

ముఖచిత్రం: ఇందిరా గాంధీ





# ఇందిరాజీ

చిరకాలమిత్రులు యమ్‌యన్ రావు (ఎపిబిడి - శేషాచలం కంపెనీ), 'ఇందిరాగాంధీ ప్రసంగాలు - వ్యాసాలు' తెలుగుచేయగల మహదవకాశం మాకు కలిగించారు. అందుకా కీర్తి కాయుని చల్లటివేళ తలుచుకుంటూ వుంటాము. ఆ పుస్తకం 1977 జనవరిలో వెలువడింది. ఎమర్జన్సీ రద్దు చేయటం, ఎన్నికల ప్రకటన, ఇందిరాగాంధీ ఓటమితో, ఆరంభంలో ఆశించిన విధంగా ఆ పుస్తకం ప్రజలలోకి వెళ్లలేకపోయింది. మొదటి నాలుగైదు ప్రకరణలు బందూర్ దంపతులూ, మిగతావి విద్వాన్ విశ్వం అనువదించారు.... అవనిగడ్డ నుంచి, మండలి బుద్ధ ప్రసాద్ సంపాదకత్వాన వెలువడే 'గాంధీ క్షేత్రం', 1984 నవంబరునెల ఇందిరాగాంధి స్మృతి సంచికలో, ఆ పుస్తకంలోని కొన్ని భాగాలు వేశారు - అవి బందూర్ దంపతులు తెలుగు చేసినవి. వాటిని 'జగతి' పాఠకులకు సమర్పిస్తున్నాము.

## బాల్యం

"ఇంత ఠీవి ఒలకపోసే పిల్లని - ఇంతదాకా నేను చూడలేదు," అన్నారట సరోజినీనాయుడు, ఆమెను ఆహ్వానించేందుకు మెట్లమీద నిలబడ్డ నాయనమ్మ చేతులలోని నన్ను మొదటి సారి చూసినపుడు - ఆరునెలల పాపను నేనప్పటికి.

నా మొదటి బాల్యస్మృతి గాంధీజీ దేశవ్యాప్తంగా విదేశవస్త్ర దహనానికి చేసిన విన్నపం సందర్భమయినది. ఆనాటి ఆవేశం ఆర్భాటం ఇప్పటికీ బాగా గుర్తు. విశాలమైన డాబామీద, విదేశీబట్టలు గుట్టగా పోశారు. ఎన్ని అందమైన రంగులో ఎంత ఖరీదైన బట్టలో! ఆ మొఖమల్ శాటిన్‌లూ, సిల్కు షిఫాన్లూ ఒక పెద్ద గుట్టగా వున్నాయి. అవి తొక్కుతూ దాగుడు మూత లాడటం ఎంత సరదావో! నా తల్లిదండ్రులపై నాకు కొంత అధికారం వుందనే విషయం, ఆనాడు



1924లో ఢిల్లీలో గాంధీగారు 21 రోజుల ఉపవాసదీక్ష గావిస్తున్నప్పుడు, బాలిక ఇందిర

మొదటిసారిగా గ్రహించాను. అందరూ ఆ భోగిమంటల ఉత్సాహంలోపడి నేను చిన్నపిల్లనికదా అని నిద్రపోగొట్ట జూశారు. ఎవరికి చెప్పుకున్నా లాభం లేదని, తాతగారితో అన్నాను. నాకూ చూడాలని వుందని! తాతగారెప్పుడూ నా పక్షమే. నన్ను వెంటబెట్టుకు తీసు కెళ్లారు ఆ మంటలు, పూర్తి అయే వరకూ మెలకువగా వుండలేక పోయాను. అగ్ని నాలుకలు వురుకుతూ వుండగా ఇంకా యింకా బట్టలు ఆ మంటల్లోకి విసురుతుండగా నా కళ్ళ మీదకు నిద్రవచ్చేసింది.

ఆ తర్వాత కొన్నాళ్ళకు నా అంత రాత్మకీ, కర్తవ్యానికీ మధ్య ఒక సంఘర్షణ ఏర్పడింది. ఇంట్లో ఒక్కతెనే పిల్లనవడం వల్ల నాకు కనిపించేవీ, వినిపించేవీ అన్నీ అమ్మద్వారాసూ, యింట్లో పెద్దవాళ్ళ ద్వారాను. ఒక సాయంత్రం మా ఇంటికి, పారిస్‌నుంచి తిరిగివచ్చిన బంధువొకామె వచ్చింది. ఆమె ఎంతో చక్కటి ఎంబ్రాయిడరీ గౌను నాకోసమని కానుకగా తెచ్చింది. చిరునవ్వుతో అమ్మ ఆ గౌను ఆమెకు తిరిగి యిచ్చేస్తూ మేమిప్పుడు చేతితో వడికినవీ చేతితో నేసినవీ మాత్రమే కడుతున్నాం' అన్నది. ఆ వచ్చిన బంధువుకి యిదేమీ బోధపడలేదు. అమ్మకట్టుకున్న చీరెవంక చూసింది. చాలా ముతకగా, గోనె గుడ్డలా వుంది. అప్పట్లో అలాంటి ఖద్దరే లభ్యమయ్యేది. ఒళ్లు వొరుసుకుపోయే

టట్లూ, చర్మం కందిపోయేటట్లు యీ ముతక బట్టలేమిటి' అని యీనడిం పుగా, 'మీ యింట్లో వాళ్లందరికీ మతులు పోతున్నట్లున్నాయి. నువ్వు పెద్దదానివి - అంచేత నీయిష్టం నీది. కాని చిన్నపిల్లల్ని కూడా క్షోభ పెట్ట డం ఏమంత మంచిపని? ఈ గౌను ఆ చిన్నపిల్లకి - నీకు కాదుగా' అన్న దామె రెట్టిస్తూ.

'ఇందూ, ఇలారా. ఆంటీ నీకొక విదేశీ ఫ్రాకు తెచ్చింది. నీకు బావుంటే తీసుకో, కాని ఆరోజు మనం విదేశీ బట్టలు తగలబెట్టాయే. అమంట మర్చి పోకు. మేమందరం ఖద్దరు కడుతున్న ప్పుడు నీకీ నాజూకైన గౌను వేసుకో వాలని వుంటే తీసుకో' అన్నది అమ్మ.

నాలో బలవత్తరమైన కోరిక; కళ్ళలో కాంక్ష వెలిగింది. నా చిన్న చేతులని ఆ గౌనుకోసం జాపాను. కాని నా చేతివేళ్ళు ఆ గౌనుని తాక డానికి పూర్వమే కంఠంలోనుంచి మాటలు వెలువడ్డాయి. 'అది తీసు కెళ్ళిపో. అలాంటివి నేను వేసుకోను.'

"ఏం? ఎందుకని? చక్కటి వస్తు వులు నీకక్కర్లేదా?" అని ప్రశ్నిం చింది యింటికొచ్చిన ఆ బంధువు.

"కావాలి. కావాలి - కాని..." అంటూ పెద్దవాళ్ళు మాట్లాడుకుంటూ వుండగా విన్న పలుకులు కొన్ని కొన్ని గబగబా అనేశాను. అందుకు ఆవి డంది; 'అలాగే కానియ్యమ్మా- విదేశీ గౌను వద్దంటున్నావు కానీ ఆ విదేశీ బొమ్మతో ఆడుకుంటున్నావే' అని. ఏదో మాట వరసకి అనాలోచితంగా అన్నది. పెద్దవాళ్ళు చిన్నపిల్లల్నె ప్పుడూ ఆటవస్తువులుగా భావిస్తారు. వారిలో మాటలకందని ఎటువంటి నిగూఢశక్తులు వుండగలవో ఆలో చించరు, నాకా ఆటబొమ్మంటే ఎంతో యిష్టం. అది విదేశీదా, స్వదేశీదా అన్న తలంపు నాకంతవరకూ రాలేదు. ఆటబొమ్మ నా నెచ్చెలీ, నా బాంధవీను, దాని కిన్నాళ్ళూ నా హృద యంలో స్థానమిస్తూ వచ్చాను. ఒక లేత మనసు పరిపరివిధాల పరు గెత్తింది. కాలపరిభ్రమణలో రోజులు వారాలవుతున్నాయి. ఆ బాలిక మనసు ఆనాటికానాడు కల్లోలితమవు తున్నది. తనంతతాను ఒక నిర్ణయం తీసుకోవలసిన భారం నెత్తినపడింది. ప్రేమకి కర్తవ్యానికీ మధ్య, యింత అందమైన బొమ్మ నాదీ అనే ఆత్మ

---

చెరగని తమ అడుగుజాడల్ని ఎందరో అనుగమించాలని.... మహాత్మాగాంధి, పండిట్జీ లాంటి మహాపురుషులు... అపర భారతమాత ఇందిర లాంటి మహిళలు తరలిపోయారు... బరువెక్కిన గుండెలతో ఒంటరిగా ఒకరి తరువాత ఒకరు.

ఆవాహన చేసుకొని సమస్త మానవాళిని...త్యాగధనుల రక్తంతో ఎరుపెక్కిన పొన్నరి పూవల్లిని .. అక్కున జేర్చుకొని పుడమి తల్లిని... ఎంద రనుగమించాలో యింకా యీ ఏకాంత పథాన్ని ?

రిమ్మా కజకోవా - 'కేశవ గోపాల్'



ముప్ఫయిలలో జవహర్ లాల్ నెహ్రూ సిలోన్‌లో పర్యటిస్తున్నప్పుడు,
తలి దండ్రులతో ఇందిరా ప్రియదర్శిని

సంతుష్టికీ, ఇది వదలుకోవాలనే మనోవేదనకీ మధ్య నలిగిపోతున్న ఆ బాలికకు, దేశమాత దివ్యగానం వినిపించింది. అన్నం సహించక నిద్ర పట్టక ఆరాటపడుతూవుంటే అమ్మాయి చిక్కిపోతున్నదనీ, నలతగా వుంటున్న దనీ బాధపడేది తల్లి. చిట్టచివర కొకనాడు ఆ బాలిక సునిశ్చయానికి రావడంతో మనఃక్లేశం అంతరించింది.

మా డాబామీదకు తీసుకెళ్ళి ఆ విదేశీబొమ్మకు నిప్పంటించాను. అది కాలిపోతున్నపుడు నా కళ్ళ వెంట జలజల రాలుతున్న కన్నీళ్ళని ఆపు కోలేకపోయాను. ఆ తరువాత జ్వరం వచ్చింది. కొన్నాళ్లు జబ్బుపడ్డాను. ఆనాడు గీసిన అగ్గిపుల్ల యిప్పటికీ నా గుండెల్లో మండుతూనే వుంది.

నెమ్మది నెమ్మదిగా మా యింటి వాతావరణం మారిపోయి రాజకీయా లకు కేంద్రం కాజొచ్చింది. పెద్దవీ చిన్నవీ నిరంతరం మీటింగులు జరుగుతూండేవి. ఇంట్లో నౌకర్లందరినీ ఒకపక్కగా చేర్చి టేబులుఎక్కి నిలబడి, పెద్దవాళ్ళనుంచి విన్న తెలిసీ తెలియనిమాటలతో ఉపన్యాసాలు యివ్వడం ఆనాటి నా చిన్నతనపు హాబీ.

* * *

## బాపూజీ

గాంధీగారితో నా మొదటి పరిచయం ఎప్పుడో చెప్పడం చాలా కష్టం. ఒక విశాల నేత్రాల బాలిక తన సొద వినేందుకు ఎవరూ దొరక్క, ఆ మహనీయునితో చెప్పు

కునేందుకు వెళుతూవుంటే, ఆ బాలిక కష్టనిష్ఠురాలను సమస్యలనూ, అతి స్తిమితంగా ఎంతో శ్రద్ధగా ఆలకించే వారు. తను ఆ బాలిక ప్రపంచంలోకి ప్రవేశించి తన తీయని మాటలతో ఆమె వేదన పోగొట్టేవారు. ఆయన ఎప్పుడూ నాకు మా యింట్లోని ఒక పెద్దలా కనిపించేవారే గాని, ఈ దేశాన్ని నడుపుతున్న మహానాయకుడనే భావం కలిగేదికాదు. ఆ బాలిక ఎన్ని కథలు చెప్పుకున్నదో ఆయనకు. ఆ తరువాత కొంచెం పెద్దయ్యాక అభిప్రాయాలు, ఆశయాలూ గూర్చి వాదోపవాదాలు సలిపి అనుభవజ్ఞానం లేని చిన్నతనపు మొండితనంతో ఆయన మాటలు ఖండించేదామె. కాని, జీవితం విశాలమై, ఆనాటికానాడు సువిశాల ప్రపంచం అవగతమవుతున్న కొద్దీ, పరిమిత జ్ఞానంతో అధిగమించలేని పర్వతశిఖరాలు కళ్లముందు సాక్షాత్కరిస్తున్నకొద్దీ ఆ మహాపురుషుని పలుకులలోని అంతర్వాహిని క్రమేపీ వెల్లడి కాజొచ్చింది. మొండిగా వాదిస్తున్నపుడు కూడా ఆయన ఎంత నిదానంగా, ఎంత ఓర్పుతో, ఎంత కుతూహలంతో నేను చెప్పేవి వినేవారో!

ఎక్కడయినా అన్యాయం జరిగినపుడు ఆయన బాధావ్యథిత హృదయం విలవిల్లాడిపోవడం నాకు ప్రత్యక్షంగా తెలుసు. వయసు వచ్చినకొద్దీ, లోకానుభవం పెరిగిన కొద్దీ ఆ మహనీయునికి ఈ దేశప్రజలతోగల బాంధవ్యలత బోధపడ జొచ్చింది. ఈ దేశ ప్రజల ఆశయాలకీ, లక్ష్యాలకీ ప్రతీకగా నిలవడమే ఆయనలోగల ఎనలేని గొప్పతనం.

నేను ఆయనకు అతి సన్నిహితంగా రాగలిగినది దేశవిభజన తర్వాత. అత్యాచారాలు, అవమానం, దోపిడీల పాలబడి రైళ్ల నిండా లక్షలాది కాందిశీకులు పాకిస్తాన్ నుంచి యిక్కడికి వచ్చినపుడు, అదొక పీడకల. ఈ దారుణాలకు జవాబుగా ఢిల్లీలోను, పంజాబులోను ప్రతీకారవాంఛ చెలరేగినపుడు, నేను బాపూజీ కార్య పరిధిలోకి సన్నిహితంగా రావడం సంభవించింది. అప్పటికి కొద్ది రోజులే అయింది నేను ఢిల్లీ వచ్చి. ఆరోగ్యం సరిగా లేని ఒక పసివాని తల్లిని. కాని గాంధీ

---

భారత ధరిత్రిపై రక్తవర్షం కురిసింది
భయంకర హింసారాక్షసి నోరు తెరచింది
అఖిల ప్రపంచ జనావళికి
అనురాగ మూర్తి నేల కూలింది
రుధిర బుధవారం
జరిగిపోయింది ఘోరం

— దాశరధి

1966 జనవరి 24 వ తేదీన రాష్ట్రపతి రాధాకృష్ణన్ సమక్షంలో, ప్రధాన మంత్రిగా ప్రమాణ స్వీకారం చేస్తున్న ఇందిరా గాంధీ

గారు ఖబురు పంపించారు. ఢిల్లీలోని భయాందోళనా పూరితమగు ముస్లిమ్ ప్రాంతాలకు నేను స్వయముగా వెళ్లి వెయ్యవలసింది కొంతవుందన్నారు. అక్కడికి వెళ్లడం ప్రమాదకరమేగాక, సామాన్యప్రజానీకానికి అటువంటి శాంతియుత కృషిపట్ల నమ్మకం సన్నగిల్లింది. అయినప్పటికీ గాంధీగారు ఆదేశిస్తే కాదనడం ఎలా? "నీ వొక్కడాని మీదనే నాకు నమ్మకం వుంది. చాలా మందిని అడిగాను. 'ఓ - అలాగే, బాపూ' అన్నవారేగాని, అడుగు ముందుకు వేసినవారు లేరు" అన్నారాయన. రోజుకి పన్నెండు గంటల చొప్పున కొన్ని నెలలపాటు ఆ మత కల్లోల ప్రాంతాల గడిపాను. వ్యవధి చిక్కినపుడల్లా బాపూజీకి నేను చేస్తున్నది నివేదించేదాన్ని. ఆయనని కలిసి మాట్లాడినపుడల్లా నాలో కొత్తశక్తి, కొత్త ఉత్సాహమూ పెల్లుబికి వచ్చేవి. ఒకోసారి రోజుల కొద్దీ ఆయనని చూడటమే పడేదికాదు. అలాంటప్పుడాయన ఒక చిన్న చీటీనో, ఒక పువ్వో తన సందేశంగా పంపేవారు. చిట్టచివరికి హిందూ ముస్లిమ్‌ల మధ్య సఖ్యత ఏర్పడి, ఒకరి మీద ఒకరు నమ్మకం కలిగించుకొని ఒకరిళ్లకు మరొకరు మనఃపూర్వకంగా వెళ్ళిరావడం ప్రారంభించారు. ఈ పనంతా పూర్తి అయేసరికి నేను బాగా డస్సిపోయాను. అప్పుడు

—కొన్నాళ్ళపాటు లక్నో వెళ్ళి విశ్రాంతి తీసుకో. నువ్వు విదేశాల్లో చదివిన చదువూ, పొందిన అనుభవం వృథా కాలేదని నాకిప్పుడనిపిస్తోంది" అని అభినందించేసరికి, ఆ మాటలు అమృతోపమానంగా తోచాయి.

గాంధీగారు రాజకీయాల నెప్పుడూ ఉన్నతస్థాయికి తీసుకెళ్ళి, మతమూ రాజకీయాలు అనేవి సిద్ధాంతాలుకావు. అవి దైనందిన జీవితంలో కార్య రూపాన అనువదింపబడి మన ఆలోచనా సరళిని సరిదిద్దాలి అనేవారు.

గాంధీజీ సజీవులై యుండగా గాంధీజమ్, మతస్థాపకుల జీవిత కాలంలోని ప్రబోధాలవలెనే, ఒక అపూర్వశక్తిని కలిగివుండేది. ఆ తరువాత అది సృజనాత్మకంగా పెరుగుతూ, పరిణతి చెందుతూవుంది. గాంధీజమ్‌లో ముఖ్య సిద్ధాంతాలుగాని, నియమావళీ నిబంధనలూగాని లేవు. ప్రతినమస్యనీ, ప్రతి ప్రశ్ననీ సమకాలీన పరిస్థితుల దృష్ట్యా సత్యం అహింసలకు భిన్నంగా విరీతిని పరిష్కరించుకోమని సూచిస్తుంది. ప్రాచీన సంప్రదాయాలతోనూ మతబోధనలతోనూ ముడివయిబడివున్న గాంధిజి బోధలు మనకున్న నమ్మకాలను గుడ్డినమ్మకాలుగా మార్చక, కార్యరంగాన్ని సువిశాలంచేస్తూ నిత్యనూతన ప్రపంచంలోకి అడుగిడమంటాయి. సర్వమతాలలోనూ ఒకప్రధానమైన ఏకత్వభావనవున్నదని ఆయన బాహాటంగా అనేవారు.

"నా ఇంటికి చుట్టూ ప్రహరీ గోడలు లేపి, కిటికీలు మూసుకు కూచోవడం నా అభిమతం కాదు. అన్ని దేశాల సంస్కృతుల వాయువులూ ఈ యింటి మీదుగా వీస్తూండాలి. ఎంత నిరాటంకంగా వీలైతే అంత. అయితే ఆ ప్రభంజనంలో నేను కొట్టుకుపోదలచుకోలేదు. నా కాళ్ళ నేలమీద ఆన్చివుంచాను. నా మతమొక బందిఖానా కాదు. భగవంతుని సర్వసృష్టికీ యిందులో సముచిత స్థానమున్నది. జాతీ, మతమూ, వర్ణమూ అనే దురహంకారులకి అతీతమైన మతం నాది."

గాంధీజీని చివరిసారి 1948 జనవరిలో కలుసుకున్నాను, మరునాడు ఆయన హత్యచేయబడతారనగా. తను ఆరోజున ఖాళీగా వున్నాననీ, వీలుంటే ఒకసారి రమ్మనమనీ కబురంపించారు.

సరిగమల సన్నాయి శాంతి పదములు పాడి
విశ్వశాంతికి వైష్ణవ్య ద్వారమై నిలచెనట

—ఎల్లోరా

ప్రపంచ ప్రజ కీర్తించిన దేవత
విశ్వమాతకు ప్రణమాంజలి

—జ్యోతిర్మయి



1982 నవంబరు 19 వ తేదీన, ఏషియన్ గేమ్స్ గోల్డ్ మెడలిస్ట్ శ్రీరామ్ సింగ్‌కి, జ్యోతి నందిస్తున్న భారత ప్రధాని ఇందిరా గాంధీ

నేనుకారు ఎక్కబోతూండగా మాతోట మాలి ఒక మల్లెదండ నేను తలలో తురుముకునేందుకని యిచ్చాడు. తెల్లటి మల్లెలు, పరిమళం వెదజల్లుతున్నాయి. ఎందుకనో అది తలలో పెట్టుకోవాలనిపించలేదు. గాంధీగారివద్దకు తీసుకెళ్లి, ఆయన పడక పక్కనుండే బల్లమీద వుంచాను. మేము ఏవేవో మాట్లాడుతున్నాం, మూడున్నర ఏళ్లవాడు మా అబ్బాయి రాజీవ్ ఆ పువ్వులతో ఆడటం మొదలుపెట్టి, గాంధీగారిని అలంకరించసాగాడు. ఒక్కోసారి వాడు ఆ పూలమాలని వారి కాళ్లకి కడియంలా చుట్టేవాడు. మరోసారి బొటనవేలు చుట్టూ చుట్టేవాడు. ఆరోజున బాపూజీ చాలా ప్రశాంతంగానూ, ఉల్లాసంగానువున్నారు. మాతో పాటు నవ్వుతూ హాస్యాలాడుతూ గడిపేశారు. అదే మేము చివరిసారి చూడటమనీ, యీ రక్షాదీపం మాంకిక వుండదనీ, ఆ బోసినోటి నవ్వుల భాగ్యం అక్కడితో తీరిపోతుందనీ అనుకోలేక పోయాను.

భారత ప్రజలను స్వాతంత్ర్య సమరోన్ముఖుల గావించి, విజయం సాధించిన ఆ కరుణాంతరంగుడు, మననుంచి మాయమవడంతో, అడవిలో అల్లాడే అనాథశిశువులమై పోయినట్లనిపించింది. ఈ సమస్యల కీకారణ్యంనుంచి బయట పడటమెలా? దారితీయగల, దారిచూప గల తేజోమూర్తి మనల్ని వొదిలి వెళ్లిపోయాడు. అయితే ఆయన ఆత్మ శక్తి మాత్రం యీ ప్రజల వారసత్వ

మైన, వారికి ధైర్యాన్నిస్తూ, [illegible] విశ్వాసదీపాన్ని కాపాడుతూ, వారిని దీక్షాపరుల గావించి, కర్తవ్యమనే కార్యక్షేత్రంలోకి నడిపించింది. ఏ దీన జనుల క్షేమంకోసం బాపూజీ హృదయం తల్లడిల్లిందో, వారు ఆ దివ్యజ్యోతి చూపిన బాటలో పయనిస్తున్నారు.

* * *

## జ్ఞాపకాలు

1942 ఆగష్టు 9వ తేదీన తెల్లవారబోయేముందు, క్విట్ ఇండియా ఉద్యమ నాయకులందరినీ అరెస్టు చేశారు. నాకేమో పతాకవిష్కరణ జరుగుతున్నపుడు మొదటిసారిగా బాష్పవాయు ప్రయోగానుభూతి కలిగింది. ఫిరోజ్‌గాంధీ (మావారు), రహస్య ప్రచార కార్యక్రమం జరిపేందుకూ, తత్సంబంధమైన ఇతర పనులకీ, అండర్‌గ్రౌండులోకి వెళ్ళిపోయారు. మీసంపెంచి, ఖాకీబట్టలు ధరించి ఆంగ్లో ఇండియన్ సోల్జరు వేషంలో పర్యటిస్తున్న ఆయన దేహచ్ఛాయ అందుకు అనుకూలపడింది. బొంబాయినుంచి వస్తున్నపుడు, పరిచితమైన అధికారుల [illegible] తననెవరైన గుర్తుపడతారేమోనని, మారుమూల చిన్న స్టేషనులో దిగి, యీ సోల్జరువేషంలో తను పట్నం చేరే నిమిత్తం రోడ్డుపై నిలబడి వుండగా బ్రిటీష్ సోల్జర్లూ, ఆంగ్లో ఇండియన్ సోల్జర్లూగల లారీ ఒకటి అటు వైపుగా వస్తే, దానిని ఆపి అందులో ఎక్కారుట. అలహాబాదులో దిగిపోతానంటే, వారు 'వొద్దు మొర్రో నిరాయుధులైన సోల్జర్లని ఈ ప్రజలు బతకనివ్వడం లేదు. మాతో వచ్చెయ్యి' అని మొరపెట్టుకున్నారుట. అయితే ఆయన నేర్పుగా తప్పించుకు దిగారు.

అప్పటికే స్వరాజ్యభవన్ మిలిటరీ వారి అధీనంలో వుంది. ప్రక్క గుమ్మమనదగు ఆనందభవనంలో మేము వున్నాము. మా ఇంటివైపు గురిపెట్టి ఉన్నాయి తుపాకులు. గ్రామీణులైన మా నౌకర్లకి ఈ పోలీసుల్నీ, ఈ తుపాకుల్నీ చూస్తే అదురుగా వుంది. 'ఎవరా వెళ్ళేది?' అని కాపలా పోలీసులు గద్దించినప్పుడల్లా వారు తమ పేరు చెప్పేందుకు హడలిపోయేవారు.

---

బాల్యంలో తల్లిని
పరువంలో భర్తను
ముదిమిలోన కొడుకును
కోల్పోయిన విషాదము
బడబాగ్నిగ ఎడదలోన
దాచుకొన్న ధైర్యశాలి
బడుగు జనుల కమృతధార
పంచిన జనమోహిని

—ఉండేలు మాలకొండారెడ్డి



1983 నవంబరు 9 - అలీన రాజ్య సమావేశంలో ప్రసంగిస్తున్న ఇందిరాజీ

శాస్త్రిజీ (లాల్ బహదూర్ శాస్త్రి) అరెస్టుకి వారంట్ సిద్ధంగావుంది. ఆయన ఈ యింట్లో వుండగలరని ఏ ఒక్కరూ అనుకోరనే మొండిధైర్యంతో వచ్చారు ఇక్కడికి. అరెస్టు కాబోయే ముందు ఆయన చెయ్యవలసిన అవసర కార్యాలు కొన్ని వున్నాయి. అందుకని ఈవిధంగా తలదాచుకోవలసి వచ్చింది. చీకటి పడితేగాని ఆయన గదిలోంచి బయట పడేందుకు వీలయేదికాదు. భోజనాన్ని అతి రహస్యంగా తీసుకువెళ్ళేవారు నౌకర్లు. వ్యాధిగ్రస్తురాలైన బంధువు ఆ గదిలో వున్నట్లుగా నాటకమాడాం. ఇది ఎంతోకాలం సాగదనీ, యీ రహస్యంపైకి పొక్కక తప్పదనీ మాకు తెలుసు అధికారులు ఏక్షణాన్నయినా ఇల్లు సోదాచెయ్యడానికి సెర్చి వారంటు పట్టుకురావచ్చు. అంచేత శాస్త్రిజీ అక్కడినుంచి మరొక చోటుకి మారవలసివచ్చింది. ఆ తరువాత కొన్నాళ్ళకి ఆయన అరెస్టు అయ్యారు. ఇంట్లో నౌకర్లందరూ ఒకచోట కలుసుకునేందుకు వీలులేకుండా పోలీసులు వెలుపలనుంచి వెయ్యికళ్ళతో పరిశీలిస్తున్నారు. అండర్ గ్రౌండులో వున్నవారికి డబ్బూ కరపత్రాలూ మా ఆయన ద్వారా అందచేయించడం నాపైగల భారం. ఈ సమావేశాలు అతికష్టంగా అర్ధరాత్రివేళ రాజకీయాలతో సంబంధంలేని వేర్వేరు మిత్రుల యింట జరిగేవి

నన్ను అరెస్టు చెయ్యనున్నారన్న సమాచారం తెలిసింది. అంతవరకూ నేను రాజకీయాలతో ప్రమేయంలేని వ్యక్తిగా, ఎంత అంటీ ముట్టనట్లు వుండటానికి వీలో అలా వుండేదాన్ని. అరెస్టు అవడం అనివార్యమైనప్పుడు చడీ చప్పుడూ లేకుండా జైలుకి వెళ్లడం కాక ఏదో కొంచెం హడావుడిచేసి మరీ వెళ్ళాలనిపించింది. నా క్కావలసిన బట్టలూ పుస్తకాలూ పుచ్చుకుని మా యింటినుంచి మరొక చోటుకి వెళ్ళాను. ఆ సాయంత్రం అయిదు గంటలకి పెద్ద మీటింగు జరుగనున్నదనే వార్త వూరంతా వ్యాపించింది. అయితే ఈ మీటింగు ఎక్కడ జరుగుతుందో తెలుసుకునేందుకు పోలీసులు ఎంత ప్రయత్నించినాకూడా తెలుసుకోలేకపోయారు సరిగ్గా అనుకున్న సమయానికి నేను వేదికమీదకు వచ్చి నిలబడగానే మూల మూలలనుంచీ ప్రజలు కుప్పతిప్పలుగా రావడం మొదలుపెట్టారు. ముఖ్యంగా పక్కనున్న సినిమా హాల్సులోనుంచీ, షాపుల్లోనుంచీ, చుట్టుపట్ల ఇళ్ళల్లో నుంచీ వస్తున్నారు. జవానికి తెలుసు మీటింగు స్థలం. కాని అధికారులకి తెలియదు. నేను సరిగ్గా పదినిముషాలు మాట్లాడానో లేదో లారీలతో మిలిటరీ వారు అక్కడికొచ్చి చుట్టూ గోడ కట్టేశారు.

ఈ దృశ్యమంతటినీ ఫిరోజ్‌గాంధీ ఎదుటనున్న మేడ మొదటి అంతస్తు గదిలోనుంచి పరిశీలిస్తున్నారు. నాలు గడుగుల దూరాన నావైపుగా ఒక తుపాకీ గురి పెట్టబడి వుండటం చూడగానే ఆయన ఆవేశమూ ఆదుర్దాతో వొణికిపోతూ గబగబ కిందికి పరుగెత్తుకుంటూ వచ్చి, "ఆ తుపాకీ కిందికి దించు. లేదా ధైర్యం వుంటే కాల్చు" అన్నారు, సార్జెంటు మీద అరుస్తూ. కొంచెం తొట్రుపడి నన్ను "ప్రిజన్ వాన్" వదకు తీసుకెళ్ళేందుకు రెక్క పుచ్చుకోబోయేసరికి, ప్రజలలో ఆందోళన చెలరేగింది. ఒక్కుమ్మడిగా ముందుకొచ్చి పడ్డారు. నా పక్కనున్న కాంగ్రెసు స్త్రీ వాలంటీర్లు నన్ను యిటుపక్కకి లాగబోయారు. ఈ యిద్దరూ కలిసి నన్ను విరిచేస్తారేమోననిపించింది. కాని అంతా సద్దుమణిగింది. తుపాకీ కాల్పులు లేవుగాని

---

ఇందిర చిందించిన ప్రతి నెత్తురుబొట్టు నుంచి
లక్షలాది విజయేందిరలు తయారవాలి
భారతమంతా ఒక విరాట్మూర్తిగా
ప్రచండ తేజం విరజిమ్మాలి

-బోయి భీన్నమ



1924 అక్టోబరు 11 – ఛీఫ్ ఆర్మీస్టాఫ్ జనరల్ వైద్యా ముద్నగు వారితో ఇందిరా గాంధీ.

తుపాకీకొనలు ప్రయోగించారు. అనేక మందికి గాయాలయాయి. మాలో చాలా మంది స్త్రీ పురుషులను అరెస్టుచేశారు. నా భర్తా, నేనూ అరెస్టు అయాము. ప్రిజన్‌వాన్‌లో ప్రయాణిస్తూ వుండగా నా మాటలకి ఆ వాన్‌లోని పోలీసులు, తమ కడుపాత్రం కోసం, కుటుంబాల కోసం ఈ ఉద్యోగాలు చేస్తున్నామని క్షమార్పణలు చెప్పుకుంటూ, తమ తల పాగాలు నా పాదాల వద్దవుంచి, తమ అసహాయ క్షోభను కన్నీళ్లతో వ్యక్త పరచడం నేను మరువలేనిది.

జైలు సందర్శన మనేది నాకు చిన్నప్పటి నుంచి అలవాటే. బంధువు లనీ, స్నేహితులనీ అతిభద్రంగా, అసం తృప్తితో కలుసుకునే ఆ యిరవై నిము షాల ఇంటర్వ్యూలు కొత్తకాదు. ఈ దేశప్రజ లెంతకీ మా ఇంట్లోని ముఖ్యుల జైలుశిక్షల సంగతి విన్నారేగాని, వారు ఎందరెందరో బంధువులు. ఇటు తల్లి వైపువారూ అటు తండ్రివైపు వారూ జైలుగోడల మధ్య తమ జీవితాలు గడ పిన విషయం వారికి తెలియదు. ఎన్ని న్నేళ్ళు దీక్షాదక్షులై కారాగారవాసం గడిపారో వారికి తెలియదు. నేను గడ గడా చెప్పగలను పాతిక ముప్పయి మావాళ్ళ పేర్లు. స్వాతంత్ర్య పోరాటం లో ఏకుటుంబమూ మావాళ్ళు పడ్డన్ని అగచాట్లు పడలేదని నిస్సంకోచంగా చెప్పగలను.

బయటనుంచి వినడానికీ, చూడ్డానికీ, లోపలవుండి అనుభవించడానికీ మధ్య నెంత వ్యత్యాసమో! 'ప్రతిరోజూ ఒక సంవత్సరంలాంటిది, ఆ సంవత్సరంలో ప్రతిరోజూ అతి పొడవైనది' అని ఆస్కార్ వైల్డ్ తన జీవితం గురించి

రాసినమాటలు అక్షరాలా నిజం. ఒక జడత్వం, ఒక శీతలత్వం మనిషిని ముసిరేస్తుంది. రోజులు నిస్పృహతో నిస్సారమవుతాయి. ఆ మనుగడలో కదలిక వుండదు. వెలుపలనున్నవారికి ఇది ఎన్నిమాటలలో చెప్పినా అర్థం కాని విషయం. జైలు జీవితం మనిషిని జంతుదశకు లాగుతుంది. అది మానవత్వాన్ని కించపరుస్తుంది' అని పెథిక్ లారెన్స్ చెప్పిన మాటలు సత్య సూక్తులు. ఈదురుగాలికీ, వర్షపాతానికీ, ఎముకలు కొరికే చలికీ మేము తట్టుకోక తప్పదు. మనుషులతోపాటు ప్రకృతి కూడా మాపై కసితీర్చుకుంటూ వుంటుంది. మిగతావారికి ఓ ఉత్తరమో, ఓబంధువు రావడమో అన్నది వుండవచ్చు. కాని నాకు అవేమీలేవు. నన్ను చూసేందుకు ఎవరు వున్నారు గనుక వెలుపల. నాభర్త ఇదే జైలులో వున్నప్పటికీ, మేము ఒకర్నొకరు చూసుకోలేము. ఎంతకాలమో ప్రయత్నించగా, అతికష్టంమీద ఒక చిన్న ఇంటర్వ్యూకి అనుమతి లభించింది. ఆ తరువాత ఆయనని, మరొక వూరు జైలుకి మార్చివేసారు. నేను ఏదో ఒక పని కల్పించుకుని నైరాశ్యాన్ని తరిమేందుకు ప్రయత్నించాను. ఒక పసిపిల్లతల్లి జైలునుంచివిడుదల అయ్యాక, ఆమె తన కాళ్ళమీద నిలబడగల శక్తినిచ్చే ప్రవేశపరీక్షకు పాఠాలు చెపుతూ ఆ పసిపిల్లను సాకుతూ వచ్చాను. బయటకు వెళ్లాలనే కోరికకూడా వుండేదికాదు. నాకు కావలసినవాళ్ళెవరూ లేరు బయట.

అన్నీ కాలావకాశాలకి కట్టుబడి సాగిపోతుంటాయి. ఒక చీకటి కొట్లో నుంచి, అమాంతం వెలుగులోనికి వచ్చినట్లయింది, నా అనుకోని విడుదల. ఈ శబ్దమంజరీ, ఈ భావలహరీ, ఈ వర్ణమయ ప్రపంచం. ఈ సజీవవాహిని నన్ను మళ్ళీ తమవైపు లాక్కోసాగాయి. నవకాంతుల సుమధురహాసంలో జైలు జీవితం ఒక చీకటి కలగా వెనక్కి వెళ్ళిపోయింది.

## ఆక్రోశం

సాధుజీవన తపోవాటికల వేదభూమిలో, అలమందల నల్లనయ్య గీతారహస్యం చెప్పిన కర్మభూమిలో, దయాదాక్షిణ్యాల నిజసారం తెలిపిన గౌతమబుద్ధుని జ్ఞానభూమిలో, నిన్నగాక మొన్న తన పాదయాత్రతో పునీతం గావించిన అహింసామూర్తి భరతభూమిలో ఇంత రక్తదాహం దాగివున్నదా? ఇంతటి సమ్మకద్రోహం

---

ఆపదలోనూ అవమానంలోనూ
నిరుత్సాహాన్ని వరించక
జయాన్ని వెతికి పట్టుకున్న
చండీశకివి

-నాయని కృష్ణకుమారి

పొంది వున్నదా? సర్వప్రపంచం ముందూ అవమాన భారంతో తల వొంచుకొనేటట్లు చేసే విషబీజాలు యింతగా విస్తరించాయా? 1948 జనవరి 30వ తేదీన శాంతిదూతను బలితీసుకున్నాడు ఒక ఉన్మాదుడు. 1984 అక్టోబరు 31వ తేదీన ఒక అమృతమూర్తిని నేల కూల్చారు ఇద్దరు ఉన్మాదులు. ఆనాడు సాయంత్రం నాలుగు గంటలవేళ నక్షత్రం రాలిపోయి ఒక శకం వెలుగు ఆరిపోతే, ఈ బుధవారపు రక్తపు మరక భారతచరిత్రలో జాతియావత్తూ సిగ్గుపడే విధంగా నిలిచిపోతున్నది. మిట్ట మధ్యాహ్నం అంధకారం తెచ్చిన ఈ దుర్దినం, డెబ్బయి కోట్ల ప్రజలను తల్లిలేని బిడ్డలుగా చేసింది. ఇందిరా గాంధీ, రాజీవ్ ఒక్కరికే కాదు, ఈ దేశ ప్రజలందరికీ మాతృమూర్తి– అమ్మ. 'అమ్మా' అను ఆ రెండుఅక్షరములలో దివ్యనామ సంకీర్తన వుంది. కడపటి నెత్తురు చుక్కదాకా ధీరత్వంతో పోరాడిన ఆ వీరాంగన అమరత్వం పొందారు. ఆ రక్త తర్పణం నుంచైనా ఈ దేశానికి సమగ్రత సమైక్యత, సుస్థిరత ఏర్పడితే, ఆ మహాతేజస్విని ఆత్మకు శాంతి!

(31-10-1984

★

నీ పవిత్రాస్థికలతో నిండిన
హిమాలయంలా నిలచి నిను తలచి
నీ మాటల నీ బాటల నీ భావోజ్వల
సున్పందనతో సాగేశకి, నడిచే ధైర్యం
మాలో కలిగి ఆత్మస్థైర్యం
కలిగించాలని ........

– ఎల్లోరా

అణువణువున వెలసిన తల్లి
అఖిల భారత ప్రజల కల్పవల్లి

—దాశరథి



# "ఒంటరిగా పథం"

సరియైనదని తలచినప్పుడు
ఒంటరిగా వెళ్ళే
నీ దృఢ సంకల్పం,
నీ ధైర్యం
నీ నేతృత్వం.
బడుగు, నిరుపేద ప్రజకై
నీకుగల చింత.
భారతదేశం, భారతీయతపట్ల
నీకుగల ఉద్రేకం.
సమస్త మానవ జాతి
హక్కుల కొరకై
నీ పోరాటం.
ఈ రోజు, ప్రతిరోజూ
మేము స్మరిస్తాం.
మన ఐక్యతను నిలబెట్టడమే
నిన్ను స్మరించే మార్గమని
మాకు తెలుసు.
నీ కొరకు

శాంతి - సామరస్యతల
స్మారక చిహ్నాన్ని
నిర్మిస్తాం

# డైరీ

1985 సెప్టెంబరు 8

యండమూరి వీరేంద్రనాథ్ 'తులసీ దళం' - సంచలనాత్మక 'ఆంధ్ర భూమి' సీరియల్ - కన్నడ 'ప్రజామణి' లో ధారావాహికంగా వెలువడింది. కన్నడ అనువాదం నుంచి చిత్రాన్ని నిర్మించారు ఒక కన్నడ నిర్మాత. దానిని తెలుగులోకి తెస్తున్నారు - నిర్మాణ రంగంలో కొత్తగా ప్రవేశిస్తున్న 'వాణీ ఫిలింస్' (తణుకు) వారు. యమ్వీరావు సమర్పిస్తున్న ఈ చిత్రానికి నిర్మాతలు: సత్యనారాయణ, సూర్యనారాయణ. వంపిణీ నుంచి నిర్మాణంలోకి అడుగిడుతున్నారు ఈ యువ నిర్మాతలు. పామ్‌గ్రోవ్‌లో జరిగిన పత్రికా సమావేశ సందర్భంగా ఈ నిర్మాతలు పాత్రికేయులకు విరుకానుకగా యిచ్చినది, యింటికొచ్చి చూసుకొంటే స్టీలుది పోపులడబ్బా - ఇంటికి వుపయోగబడే వస్తువు కదా అని యిచ్చివుంటారు. వస్తువుదేముంది, వస్తువు వెనకనున్న అభిమానం ముఖ్యం! పశ్చిమ గోదావరి జిల్లా నుంచి వచ్చిన ఈ యువకుల కలలు కొంతమేర అయినా సఫలమవ్వాలని అభిలషిస్తున్నాం. పి ఆర్ ఒ : వెంకటేశ్వరావు.

. . . . 9

లక్ష్మీ ప్రసన్నావారి 'ఏడడుగుల బంధం' పాటల ప్రొజెక్షన్ సవేరా 'పల్లవి'లో, అయిదుపాటల్లో ఒక్కటి తప్ప మిగతా నాలుగూ ఆత్రేయ రాసినవి. "నీ కోసమే నా జీవితం - ఈ పాట నీకే అంకితం - స్వరములు వినగా - నా ఎదవాకిట - వెన్నెల కురిసినది' అని జయసుధమీద చిత్రీకరణ జరిగిన జానకిపాట, ఈ చిత్రంలో ఒక రసవర్షం. భర్తకు (మోహన్‌బాబు) మిత్రునిపై (రంగనాథ్) అనుమానబీజం మొలకెత్తుతుంది. ఆ అసూయాగ్ని ఎంతవరకూ వెళ్తుందంటే 'జీవించను - మరణించను - వీలుకాని జీవితం'గా పరిణమిస్తుంది. జయసుధ, మోహన్‌బాబు నాయికానాయకులు. సత్యనారాయణ, జగ్గయ్య, రాళ్లపల్లి, రంగనాథ్, గిరిబాబు, శ్రీలక్ష్మి, అనూరాధ, సారథి మున్నగువారున్నారు. దర్శకత్వం: దాసరి నారాయణరావు. సంగీతం: శంకర్-గణేష్.... పాటల తర్వాత 'చోళా'లో లంచ్. నిర్మాత మోహన్‌బాబు పత్రికలవారితో ముచ్చటిస్తూ ఈ చిత్రంలోని సొగసులూ, స్పందింపజేసే సన్నివేశాలూ గురిం

చెప్పారు. మన వివాహ వ్యవస్థలోని గొప్పతనాన్ని, స్త్రీ మూర్తిలోని ఆత్మ గౌరవాన్ని, ఔదార్యాన్ని విలక్షణంగా చూ పేం దు కు ప్ర య త్నిం చా మ ని అన్నారు.

..... 10

మ్యూజిక్ అకాడమీలో 'ఐ సి సి ఆర్' వారు (Indian Council for Cultural Relations), సోవియట్ యూనియన్ సమాచారశాఖ సంయుక్తంగా ఏర్పరచిన షోస్టకొవిచ్ క్వార్టెట్ (SHOSTAKOVICH QUARTET) క్వార్టెట్ అనగా ఒక సెల్లో (Cello), ఒక వయొలా (Viola), రెండు వయొలినులు (Violins) ఉంటాయి; నలుగురూ కలిసి పాశ్చాత్య శాస్త్రీయ సంగీతాన్ని తమ తమ వాద్యాలపై పలికిస్తారు. వారి సంగీతానికి గాత్రం గాక శబ్ద సౌందర్యమే ప్రధానం. 1967 లో ఏర్పడ్డ ఈ 'షోస్టకొవిచ్ క్వార్టెట్' ప్రపంచ వ్యాప్తంగా అనేక కోట్ల కచేరీలు చేసింది. 1973 నాటి బుడాపెస్ట్ సంగీతోత్సవంలో ప్రథమ బహుమతి పొందింది. ఈ నలుగురు విద్వాంసులూ తామొక శబ్దానంద లహరిలో ప్రవేశించి, శ్రోతలను ఆ సప్తస్వర లోకంలోకి తీసుకువెళ్లడం ఒక రసానుభూతి. ఆ సంగీతార్థాలూ తు లూ తెలియకపోయినప్పటికీ మనసుపై నర్తిస్తుందిఆనాదం. భారత్ సోవియట్ సాంస్కృతిక వొప్పందం ఒక భాగంగా, ఈ బృందం మన దేశంలో పర్యటిస్తూ, ప్రధాన నగరాలలో తమ సంగీతం వినిపిస్తున్నది. మ్యూజిక్‌కి మాటలక్కర్లేదు నిశ్వసించే గడ్డిపోచలోనూ, నిదురిస్తూ పారే నీటిలోనూ మ్యూజిక్ వున్నదన్నాడు బైరన్.

..... 11

మోహన్‌జీ జగన్‌జీలు గంధం జగన్మోహనరావు రమాచిత్రాలయ పేరిట నిర్మిస్తున్న 'ఓయింటి కాపురం' పాటల ప్రొజెక్షన్ చూపారు – సురేష్ మహల్‌లో! దర్శకులు రేలంగి నరసింహారావు, 'యిలాటిది మనింట్లోనూ జరిగింది' అనిపించే సన్నివేశాలతో ఈ చిత్రకథ సమకూర్చామని చెప్పారు. జయమాలినీ చంద్రమోహన్‌ల పాట, జయమాలిని యింట్లో ఆమె బెడ్‌రూమ్ లోనే, ఆమె బాత్‌టబ్‌లోనే ఒక్కరోజులో చిత్రీకరించారట. నారాయణరెడ్డి, రాజశ్రీలు రచించిన అయిదు పాటలూ రసపుష్టితో రాణిస్తున్నాయి. శరత్‌బాబు రాజ్యలక్ష్మి, చంద్రమోహన్ – భానుప్రియ, వీరుగాక సంగీత, జయమాలిని, సత్యనారాయణ, గుమ్మడి మున్నగువారున్నారు. రేలంగి నరసింహారావు దర్శకత్వంలో వుండే నవ్యత, ప్రత్యేకత ఈ చిత్రంలో కూడా వుండగలదని ఆశిస్తున్నాం.... సమావేశానంతరం పత్రికలవారికి చాలా అందమైన 'ట్రావెల్ టైమ్‌పీసెస్' ప్రజెంట్ చేశారు నిర్మాతలు. డైనింగ్ టేబుల్ కెదురుగా గోడమీద 'సుమలత' క్లాక్, ఫ్రిజ్‌మీద 'అనూరాధ' టైమ్‌పీస్ – ఈ సారి ఊరెళ్లినప్పుడు,

హోటల్‌వారు ఉదయం అయిదు గంటలకి లేపడం మర్చిపోయినా, సుశ్రావ్య నాదంతో మేల్కొల్పే 'ఓ యింటి కాపురం' టైమ్‌పీస్.... పబ్లిక్ రిలేషన్స్ : జగన్.

. . . . 15

యల్‌టి ఫిలిమ్స్‌వారి 'లవ్ మాస్టర్' పత్రికా గోష్ఠి. నిర్మాతలు : బంగార్రాజు, రాజశేఖరరెడ్డి. దర్శకత్వం: పి.డి. ప్రసాద్. వాణీవారి 'మాయలాడి'తో పరిచయమైన కపిల్ దేవ్, ఈ చిత్రంలో ద్విపాత్రాభినయం; మళయాళంలో ఇరవై చిత్రాలలో హీరోయిన్‌గా వేసి తెలుగులో ఉపపాత్రలకే తప్ప ప్రధానపాత్రకు అవకాశం లభించని రాగిణి - డాషింగ్ గర్ల్ - యిందులో కథానాయిక. 'డాషింగ్' అని ఎందుకంటున్నామంటే, ఆమె ఈ మధ్యనే తన కారుని ఒక గోడకి డాష్ యిచ్చి, ఆ కారు వంకర్లు తిరిగి రూపురేఖలు కోల్పోగా, ఈమె మాత్రం ముక్కుమీద చిన్నగాయంతో బయటపడిందట - రెండు రోజులు రెస్ట్ విజయా హాస్పిటల్‌లో. ఈ విషయమామె ఎంతో 'లైటర్ వీన్'లో చెప్పింది. ఆ చెప్పిన పద్ధతిలోనే ఆమె ఉత్సాహం, చొరవా వెల్లడవుతున్నాయి. తెలుగులో కాసేపు తికమకపడి, ఆ తర్వాత చక్కటి ఇంగ్లీషులో, తన కిచ్చిన ద్విపాత్రను ఏవిధంగా పోషించినదీ చెప్పాడు కపిల్‌దేవ్. 'లవ్ మాస్టర్' షూటింగ్ ఇరవై అయిదు రోజులలో పూర్తయిందట. ఆధునిక యువతీ యువకుల మనోభావాలకు ఈ చిత్రమొక దర్పణం - అంటు

న్నారు దర్శకులు ప్రసాద్. 'వాణీ' వారి ఆఫీసు డాబామీద, చల్లటివేళ జరిగిన ఈ సమావేశానికి సూత్రధారులు యస్వీ సుబ్బరాజు. వాణీ సినీ ఆర్ట్స్‌వారి 'లేడీజేమ్స్‌బాండ్'లో 'పున్నమి రాత్రి'లో పరిచయమైన సిద్ధారది ఒక ముఖ్యపాత్ర - ఈ చిత్రానికి దర్శకులు చంద్రశేఖరరెడ్డి.... 'లవ్ మాస్టర్' నిర్మాతలు యల్‌టి ఫిలిమ్స్‌వారు తమ కానుకగా చక్కటి టీసెట్లు ప్రజెంట్ చేశారు పత్రికల వారికి - క్రోకరీ కాదు, చక్కటి నగిషీతో స్టెయిన్‌లెస్ స్టీల్; చేతిలో నుంచి జారినా పగిలే ప్రమాదం లేదు.... పబ్లిక్ రిలేషన్స్: జగన్.

. . . . 16

సాంస్కృతిక సంస్థ 'శంకరా భరణం' వారు వింజమూరి సీతాదేవి రచించిన 'ఆంధ్రప్రదేశ్‌లోని జానపద సంగీతం' (Folk Music of Andhra Pradesh) గ్రంథావిష్కరణను టిటికె హాలులో జరిపారు. కేంద్ర సంగీత నాటక అకాడమీ ఉపాధ్యక్షులు వి.వి. కృష్ణమూర్తి గ్రంథావిష్కరణ గావించగా, రామ్మూర్తి ఐఎయస్ మొదటికాపీని అందుకున్నారు. 'శంకరా భరణం' మేనేజింగ్ ట్రస్టీ వెంకటకృష్ణ స్వాగతం తెలుపగా, పార్థసారథి, ఎయస్ రామన్, నారాయణస్వామి, రంగరాజన్ ప్రసంగించారు. జానపదులలో సచేతనంగా నిలిచివుండే గాన స్వభావాన్నీ, స్వరూపాన్నీ వివరించా, వింజమూరి సీతాదేవి తమ గ్రంథంలో

. . . . 18

"ధనార్జనే ప్రధానం కాదు, ఆర్జించిన ధనాన్ని, వితరణ బుద్ధితో సత్కార్యాలకు వినియోగించగలిగినప్పుడే, ఆ ఆర్జనకు సార్థక్యం ఏర్పడుతుంది.... నేను పబ్లిసిటీ కోసం, పేరు కోసం యిస్తాననే అపవాదు వుంది అది కించిత్ స్వార్థమే కావచ్చు. ఆ స్వల్ప స్వార్థంతోనైనా కళాత్మక కార్యాలకు వుపయోగపడ గలుగుతున్నందుకు సంతోషంగా వుంది,"- అన్నారు పారిశ్రామికవేత్త సుబ్బరామిరెడ్డి, హోటల్ సవేరాలో ఏర్పరచిన పత్రికా సమావేశంలో. అర్జునరావు స్వాగతం తెలుపగా, శ్రీనివాస్, కాగడా శర్మ, గోటేటి ప్రసంగించారు. మద్రాసు తెలుగు ఫిలిమ్‌జర్నలిస్ట్స్ అసోసియేషన్ కార్యదర్శి పసుపులేటి రామారావు వందనసమర్పణ గావించారు. సుబ్బరామిరెడ్డి, శశిభూషణ్, రామానాయుడు సంయుక్తంగా ఒక భారీ చిత్రం నిర్మించనున్నారట. అసోసియేషన్ బిల్డింగ్‌ఫండ్‌కి పాతికవేలు విరాళం ప్రకటించారు సుబ్బరామిరెడ్డి.... మధ్యాహ్నం మూడు గంటలకు జర్మన్ హాలులో, మల్లెమాల యమ్మెస్ రెడ్డి, ఉండేల మాల కొండారెడ్డి 'మొగలి రేకులు' అనే కృతి కన్యను స్వీకరించారు. పెళ్లి పెద్ద: సుబ్బరామిరెడ్డి; పౌరోహిత్యం: యస్వీ

బాలసుబ్రహ్మణ్యం. ముదివర్తి కొండమాచార్యులు. అప్పజోడు వెంకటసుబ్బయ్య, తెలుగుగంగ స్పెషలాఫీసరు వెంకటశివయ్య ప్రసంగించారు. 1981 అక్టోబరులో అచ్చయిన ఈ ఖండకావ్య సంపుటికి, కృతికర్త 'ఉండేల', కృతిస్వీకర్త 'మల్లెమాల'- అయితే, 'పాణిగ్రహణం' మాత్రం 1985 సెప్టెంబరులో జరిగింది. 'నీవెక్కడ వెలసితివో, నేనెక్కడ మొలచితినో, ఇరువుర ముడివేసెనయ్యా, సరస సాహితీబంధం, - మొగలిరేకులందు నిలిచి, ఎగసిపోని గంధం' - అంటున్నారు ఉండేల. 'చెలిమి కలిమి నడుమ సేతువు నిర్మించి, మంచి పెంచి మమత పంచినావు' అని చెబుతున్నారు, మల్లెమాల వినయాంజలి ఘటిస్తూ. మనసులోని, చీకట్లను మాయించే చిచ్చుబుడ్లే, తాము కోరే దీపావళి అనీ. 'షాజహాను నిర్మించిన, తాజమహల్ చలువరాళ్లు. హిమాలయం మంచురాళ్లు, ఇలాతలం పసిడిరాళ్లు .... అందాలచంద్రునిలో కూడ, అన్నీ కటికరాళ్లు, అంతగా ప్రయాసపడి, అమెరికనులు తెచ్చినవి రాళ్లు' అనీ, 'పరమశివుడు ఏమైనాడో? లింగాయతుడై తక్కినవారిని, క్రుంగదన్ని పొమ్మన్నాడు! - మహావిష్ణువేమైనాడు? తిరుపతి కొండల మంగలివాడై, తిరుక్షౌరములు చేస్తున్నాడు' అనీ, స్ట్రక్చరల్ ఇంజనీరు మాలకొండారెడ్డి, తమ కవితా సుమ పరిమళాన్ని అఖిలాంధ్ర ప్రజకు పంచుతున్నారు. 'పాండవులను చేరితే, పాంచాలి లభిస్తుందని, శ్రీకృష్ణుడే కర్ణుని, చెవిలో ఊదగలేదా?' అంచేత, పదవీకాంత కోసం పార్టీలు మారుసారనే కవితా వ్యసనంలో సామాజిక

వాస్తవికత, సచేతన సందేశం వున్నాయి. శ్రీ శ్రీ, దాశరథి, మరుపూరు కోదండరామిరెడ్డి వంటివారు ఈ కవితా సంకలనాన్ని మనస్ఫూర్తిగా మెచ్చుకోవడంలో ఆశ్చర్యంలేదు. సినీ వనాన గుబాళిస్తున్న 'మల్లెమాల' తో, చెలిమిని దృఢతరం చేసుకున్నాయి 'మొగలిరేకులు'.... ....'రాజేశ్వరీ', లో సాయంత్రం ఆరుగంటలకు, 'పల్నాటి సింహం' శతదినోత్సవం.... ఈ చిత్రం పంపిణీదారులు: సాయి రాం, శ్రీ కృష్ణా, జగపతి, విజయ, లక్ష్మి, శ్రీ విజయలక్ష్మి, శాంతి, జగన్నాథ్, ఉషాపిక్చర్స్, పద్మశ్రీ, రవి శంకర్.... విజయోత్సవ కేంద్రాలు: విజయవాడ, విశాఖపట్నం, హైదరాబాదు, గుంటూరు, కాకినాడ, రాజమండ్రి, నెల్లూరు, కడప, తిరుపతి, ఏలూరు, మచిలీపట్నం, తణుకు, ఒంగోలు. తెనాలి.... ఈ సందర్భంగా 'అభివందనం' అనే పుస్తకం. విజయోత్సవ సంకేతంగా సమర్పించారు మల్లెమాల. 'వీధిబడిలో అబ్బిన నాలుగు అక్షరమ్ములే ఆస్తిపాస్తులుగ పదకొండేళ్లకే బ్రతుకు బాటపై పడ్డాను' అనే సహజకవి మల్లెమాల, అక్షర రమ్యతతో, 'పల్నాటి సింహం' విజయానికి తోడ్పడ్డవారందరినీ, సన్నని బంగారు తీగెల్లో ముత్యాలమాలగా కట్టి, వారిని వేదికమీదకు ఆహ్వానించి సత్కరించారు. సభాధ్యక్షులు: డి వి యస్ రాజు; 'అభివందనం' ఆవిష్కరణకర్త సినారె; ప్రారంభకులు: దాసరి నారాయణరావు; ప్రత్యేకాహ్వానితులు సుబ్బరామిరెడ్డి. 'మహిత వినయశీల మల్లెమాల' పద్యాలు, సూక్తులూ పుస్తకపేజీలలో ఎడమ వైపున నారింజపండు రంగులో వున్నాయి. ఒక తెలుగు పుస్తకాన్ని యింత చక్కగా, యింత రసవత్తరంగా కవితాధార కావ్యగీతి సమన్వయ పరుస్తూ, ప్రతిపుటకీ ప్రతిబొమ్మకీ ప్రతిమాటకీ కొత్త అందాలు చేకూరుస్తూ ప్రచురించినవారు, మాకు తెలిసినంతలో మరొక రెవరూలేరు... శతదినోత్సవానికి పూర్వరంగంలా, ప్రొద్దుటూరు నరాల రామారెడ్డి అష్టావధానం, చలనచిత్రావధానం పేరుతో సరిగ్గా ఆరుగంటలకు ప్రారంభమయింది. చలనచిత్రావధానమని ఎందుకన్నారంటే, పాల్గొన్న వారందరూ (సత్యనారాయణ, గుమ్మడి, పేకేటి శివరామ్, మురళీమోహన్ మున్నగువారు) సినిమావారు, వేసిన ప్రశ్నలు జయసుధ అధరాలు, జయప్రద అందాలు, భానుప్రియ వొంటి సొంపులు, శ్రీదేవి నడకలు, సుహాసిని నవ్వులు - యిలాంటివి. జయసుధనాసిక సంపెంగ అంటూ, భానుప్రియ తను వుని హరివిల్లుతో పోలుస్తూ, రాజహంసలకు నడక నేర్పగలది. శ్రీదేవి అని మెచ్చుకుంటూ, ప్రేక్షకులు పిచ్చాసుపత్రిపాలు గాకూడదంటూ నరాల రామారెడ్డి అవధానకర్తగా చేసిన హెచ్చరికలో చమత్కృతితోబాటు రసజ్ఞత, ఔచితజ్ఞత, హృదయవైశాల్యమూ వున్నాయి.... షీల్డ్‌సూ. యిచ్చి పుచ్చుకోవడాలూ యివన్ని యథారీతిని

జరిగాయి.... మధ్యాహ్నం జర్మన్ హాలులో, ప్రముఖుల సన్మాన సందర్భంగా, మద్రాసు తెలుగుఫిలిమ్ జర్నలిస్ట్స్ అసోసియేషన్‌నీ బిల్డింగ్ ఫండ్‌కి మూడువేల రూపాయలు విరాళంగా ఇచ్చారు కౌముదీ నిర్మాత యమ్మెస్ రెడ్డి.

. . . . 21

'ప్రభవించిన ఈ ఉదయం - ప్రజావాణి ప్రభంజనం - చీకటి బ్రతుకులకిదే నవోదయం - ఆశల వాకిట ఇదే శుభోదయం' (బి ఈశ్వరరావు) అంటూ బాలసుబ్రహ్మణ్యం పాడిన పాటను శారద, శ్యామలరావు, రజని, భానుచందర్ మున్నగు వారి పై చిత్రీకరించారు. 'రాజమండ్రిలో రాజ్యమేలి వచ్చాను - జాతకాలు ఎందరివో తారుమారు చేశాను' (బి ఈశ్వరరావు) - అనూరాధపై చిత్రీకరించారు జానకిపాడిన ఈ పాటను. 'గున్నమ్మా-గున్నమ్మా', చుట్టూ చూడు తమ్ముడూ (రెండూ నారాయణరెడ్డివి).... 'ఉదయం' పిక్చర్లోని మొత్తం నాలుగు పాటలు చూపారు 'శ్రీనివాసా'లో రవికిరణ్‌వారు. దర్శకత్వం: కోడి రామకృష్ణ. ఎగ్జిక్యూటివ్: హెచ్చెమ్ రెడ్డి; నిర్మాత: నరసారెడ్డి. శారద, భానుచందర్, శరత్‌బాబు, రాజేంద్రప్రసాద్, సుధాకర్, శ్యామలరావు, వీరభద్రరావు, రజని, దేవి, అనూరాధ గల ఈ చిత్రం తుది మెరుగులు దిద్దుకుంటోంది ... ప్రెస్ రిలేషన్స్: జగన్మోహనరావు.

. . . . 29

ఈ మధ్యాహ్నం 'టాజ్ - క్లబ్ రూమ్'లో యువచిత్రావారి ప్రెస్ మీట్ అండ్ లంచ్. ఇది వారి అయిదవ చిత్రం - సాంఘికం - పేరు: సీతారామ కళ్యాణం. శ్రీరామనవమి ఉత్సవాలకీ, విడిపోయిన జంట కలుసుకోవడానికీ యితివృత్తరీత్యా ఏదో బాంధవ్యం వుండటం వల్ల ఆ పేరు పెట్టినట్టున్నారు. దర్శకత్వం: జంధ్యాల. సంగీతం: మహదేవన్. బాలకృష్ణ కథానాయకుడు గనక ఫైట్స్ వున్నాయా అని అడిగిన ప్రశ్నకు మూడే వున్నాయన్నారు. మూడు పువ్వులూ ఆరు కాయల్లా, మూడు ఫైట్సూ, ఆరుపాటలూ. కథానాయిక: రజని. జగ్గయ్య, రామకృష్ణ, గొల్లపూడి, రాజేష్, శుభలేఖ సుధాకర్, శ్రీధర్, జీవా, గిరీష్, రమాప్రభ, అరుణ, సంగీత, చంద్రిక వున్నారీ చిత్రంలో. సమర్పణ; నరసింహం నాయుడు. నిర్మాత: మురారి.... సాయంత్రం 'అడయారు గేట్' లో 'రాశీ మూవీ క్రియేషన్' వారి 'మహారాజు' శత దినోత్సవం. సభాధ్యక్షులు డివియస్ రాజు, ఫిలిమ్ పరిశ్రమ గడ్డురోజుల నుంచి బయటపడిందన్నారు. చిత్రవిజయానికి తన కృషే గాక సుహాసిని కన్నీళ్లా నటనా కౌశలమూ ఎంతో సాయపడ్డాయన్నారు శోభన్‌బాబు. 'విజయ' తన పేరుకి ముందునున్న బాపినీడుగారు, 'మహారాజు' పాటను కనులు చెమర్చేటట్టు

విత్రీకరించారు - అన్నారు షావుకార్ జా.కి. కార్యక్రమ నిర్వాహకులు: మురళీమోహన్.... నూరురోజులు ప్రదర్శించిన కేంద్రాలు; హైదరా బాదు - సంధ్య; విజయవాడ - రాజ కుమారి; విశాఖపట్నం - రామా. గుం టూరు - శ్రీకృష్ణా; రాజమండ్రి ఊర్వశి. కాకినాడ - ఆనంద్; తిరుపతి జ్యోతి; వరంగల్ - కాకతీయ; నిజామా బాద్ - అశోక్; ఖమ్మం - సుందర్; కరీంనగర్ - వెంకటేశ్వర; హనుమ కొండ - ఊర్వశి; చీరాల - మోహన్; ఒంగోలు - వెంకటేశ్వర; కడప - కృష్ణా కర్నూలు - రాధాకృష్ణా; భీమ వరం - పద్మాలయ; గుడివాడ - లక్ష్మి రాశీ నిర్మాత నరసింహారావు వెనకటి చిత్రం 'బావా మరదళ్లు' పదహారు కేంద్రాలలో శతదినోత్సవం చేసు కోగా, యిదిపద్దెనిమిది కేంద్రాలలో.... 'మహారాజు'లో సమకాలీన సమాజ స్వరూపం కనిపించింది గనకనే ప్రేక్షకులంతగా ఆదరించారు ... ఈ సందర్భంగా ఒక్క ముక్క చెప్పాల్సి వుంది. 'ఖైదీ' శతదినోత్సవమప్పుడు మ్యూజిక్ అకాడమీవద్ద చిరంజీవి అభిమానులు, 'పల్నాటి సింహం' శత దినోత్సవ మప్పుడు 'రాజేశ్వరి'లో కృష్ణ అభిమానులు, యివ్వాళ 'అడ యార్ గేట్'లో శోభన్ బాబు అభి మానులు చేసిన అల్లరీ ఆర్భాటం సభామర్యాదకు విరుద్ధమైనవి. ఇవి ఆయా తారల ప్రతిష్టను పెంచవు సరికదా పాడుచేస్తాయి......... రామ కృష్ణ హెగ్డె ఒక నూతన నటుడు - యాక్షన్ హీరో. కరాటె నేర్చుకున్నా డట, బిఎ పాసయాడట, ఏడు పిక్చ ర్సలో బుక్ అయాడట. ఇవ్వాళ తన బర్త్ డే అని పత్రికలవారిని ఆహ్వానించారాయన - 'అడయారు గేట్'లో నీటికొలనువద్ద, శత దినో త్సవ వేడుకల తర్వాత ఈ పార్టీ. పత్రికా సమావేశమంటే యింకొంచెం హుందాగాను, క్రమబద్ధంగాను వుం డాలి. చిన్నవాడుకదా, ముందు ముందు నేర్చుకోగలడని ఆశిద్దాం. ★

అతి సామాన్యునికి ఆత్మగర్వం వుండదు - అడుగునున్న వానికి పడతా ననే భయం వుండదు. —బున్ యన్

సామాన్యమైన స్త్రీలకే ప్రేమంటే ఏమిటో తెలుస్తుంది-. అందమైన స్త్రీల జీవితం ఆకర్షణల మధ్య గడుస్తుంది. —హెప్ బర్న్

వ్యాకరణ సూత్రాలకంటె పనిముట్లు వాడకం నేర్చుకోవడం ముఖ్యం —బట్లర్

సమీక్షలు 

# బొమ్మరిల్లు వారి 'ఇల్లాలూ వర్ధిల్లు'

దేవదాసు (మురళీమోహన్) పార్వతిని (సుమలత) ప్రేమించాడు. రామాపురం తీసుకువెళ్లిన బండివానిలా మామయ్య (గొల్లపూడి మారుతీరావు) ఆపద్బాంధవుడవుతాడు. స్నేహితురాలు మనోరమ లాంటిది, మామయ్య భార్య (అన్నపూర్ణ) పార్వతి విషయంలో. శరత్ కథలో గేట్లు మూసుకుపోతాయి; ఇక్కడ గేట్లు తెరవబడి యిద్దరికీ పెళ్లవుతుంది. చెంప దెబ్బ రుచి చూసిన దేవదాసు, పార్వతి వంటి వ్యక్తిత్వం గల అమ్మాయిని 'ఒసేవ్, ఏమేవ్' అనగలగడం దుస్సాహసమే! కట్నం పుచ్చుకున్న వాణ్ణి చేసుకోనని భీష్మించుకు కూచున్న పార్వతి, దేవదాసు తండ్రి రహస్యంగా కట్నం పుచ్చుకున్నాడని తెలిసిన మీదట కూడా, ఎందుకు తిరగబడలేదో మనకి అర్థంకాదు. ఆమె ఆత్మాభిమానాని కదొక కత్తిపోటు. చమత్కార సంభాషణలు, వాద ప్రతివాదాలు తప్పితే పాత్రలకు జీవం లేదు. మొదటి రాత్రి పాలగ్లాసుతో పడకగదిలోకి వచ్చిన పార్వతి, తనని తాను అర్పించుకొనేందుకు అభ్యంతర పెడటంలో కొంత అర్థం వుంది. కాని ఇంట్లో పనివాళ్ల 'సెక్స్ సీను' చూసే దాకా ఆమెలో చలనం కలగకపోవడం చాలా 'క్రూడ్' గా ఉంది. తన ఇష్టానికి వ్యతిరేకంగా భర్త వల్ల పశుప్రవృత్తి' తో 'రేప్' చేయబడ్డ పార్వతి, ఆ అవమానాన్ని అంత సులువుగా భరించదు. శారీరక సుఖం వైపు కాంక్ష వున్నా, 'అహం' అడ్డుపడుతుంది. ఆ 'అహం' నుంచే వ్యక్తిత్వం జనించేది. బండికి రెండు చక్రాలమని భావించే పార్వతి, తన భర్త అక్షరాలా తను చెప్పినట్లు వినాలనుకోవడం కూడా కరెక్ట్ కాదు – అది పురుషదాస్యమవుతుంది. ఒక విశాలమైన మేడకు పైభాగాన దిగువభాగాన నివశిస్తున్న రెండు సంసారాల్లోని అవ శ్రుతులకు సినీవాఖ్య ఈ చిత్రం. స్త్రీ వ్యక్తిత్వం పట్ల వారికే సదవగాహన లేనప్పుడు మన కేం చెప్పగలుగుతారు? .... సుమలత తన పాత్రకు రమ్యత, రాణింపూ తెచ్చింది. అందమూ ఐశ్వర్యమూ గల భార్యను ప్రసన్నురాలు గావించుకొనేందుకు భర్త పడేపాట్లు దయనీయంగా చూపాడు మురళీమోహన్. 'స్మాల్ పిప్పి'తో దండలు

మార్చుకున్న మారుతీరావు, సూక్తులూ చతురోక్తులూ విరివిగా గుప్పాడు. గంభీరమైన పాత్రకు నిండుతనమిచ్చింది అన్నపూర్ణ. 'వెధవ' శబ్దం వూతపదంగా గల వియ్యంకుడి పాత్రని సముచితంగా పోషించాడు రావి కొండల్రావు. వివరతికమకపడి ద్విపాత్రాన్సృష్టి గావించినప్పటికీ, ఏదో చెప్పాలనే ప్రయత్నం వుందీ చిత్రంలో. దర్శకులు : రాజా చంద్ర.

## వసుధా వారి

## 'పగటి దొంగ'

'ఇలాంగు మేన్' అనే విజయవంత మగు తమిళ చిత్రానికి యిది తెలుగు రూపం. హరిప్రసాద్, సులక్షణ, పూర్ణిమ, రాజేష్, అనూరాధ - యిందులో ప్రధాన పాత్రలు పోషించారు. విదేశీయ వాతావరణాన్ని కొడై కెనాల్ బాక్ గ్రవుండ్‌లో ప్రవేశ పెట్టారు - ఈ క్రయిమ్ చిత్రంలో. భారతీయ తత్వానికీ, భారతీయరక్తానికి విరుద్ధమైనపాత్ర అడ్వకేట్ రాజాది (హరిప్రసాద్) - న్యాయవాద వృత్తిలో అంతటి నీచులు లేరు ఈ దేశంలో. కాళ్లులేని భార్య కోటీశ్వరురాలు; ఆమె ఆస్తి ఎలాగూ తనదే! ఆమెని చంపేందుకు 'మోటివ్' కనిపించదు; అలాగే, తీరికూచుని రాధని వంచించే దుస్థితి కారణాలు కనబడదు. వెతుక్కుంటూ వచ్చిన రాధని (పూర్ణిమ) కాళ్లులేని శాంతి (సులక్షణ), మంచం మీదున్న పడకసంచిలో ఇక్కి బిగించ గలదా? ఎన్నో అసందర్భాలు వున్నప్పటికీ సస్పెన్స్ కాపాడగలిగారు. పూర్ణిమ నటనలో ప్రత్యేకత ఏమీ లేదు; సులక్షణ మాత్రం బాగా స్కోర్ వేసింది. 'సీజన్డ్ విలన్' పాత్రని హరిప్రసాద్ సమర్ధవంతంగా పోషించాడు. సాహితి పాటలలో కవితా ధార ఉంది. దర్శకత్వం: జయ. నిర్మాత : కాట్రగడ్డ ప్రసాద్.

## కౌముదీ వారి

## 'లేడీ డాక్టర్'

గ్రామీణారోగ్యాభివృద్ధి పథకంలో ఒక భాగంగా కొందరు డాక్టర్లు గిరిజన పల్లెలో వైద్య శిబిరం వేసుకుంటారు. ఆ సందర్భంగా సీనియర్ డాక్టర్ హరీష్, జూనియర్ డాక్టరు నందిని, సహజ స్త్రీ పురుషానురాగంతో చేరువవుతారు. నందిని అతనిలో ఒక గురువునీ, ఆత్మీయునీ, అపూర్వ స్నేహితునీ చూస్తుంది. హరీష్ మాత్రం ఆమెలో ప్రియురాలినీ, ఇల్లాలినీ చూస్తాడు. ఈ స్నేహలత ఎక్కడ మాడిపోతుందో వాడిపోతుందో నని భయపడుతూనే, తన మనోగతం వెల్లడిస్తాడు హరీష్. 'మీరు నాకు పూజ్యులు, మార్గదర్శకులు - ఈ దేహాలాలసలో మిమ్మల్ని భాగస్వామిగా ఎలా చేయగలను?' - అని దీనంగా, హృదయ విదారకంగా అంటుంది నందిని. అది చాలా గొప్ప సన్నివేశం - అధునిక జీవన సరళిలో స్త్రీ పురుషుల మధ్య స్నేహం, పడక

గదిలో అంతం కానవసరం లేదనీ హృదయధర్మం మధురగీతికను వినిర్మలంగా ఆలపించగలదనీ చెబుతుందా సన్నివేశం. నందినికి చిన్నప్పుడే ఒక బంధువుతో (ఇంజనీరు) పెళ్లి నిశ్చయమయింది ; హరీష్ తన ప్రేమ వెల్లడించిన తర్వాతనే ఆ పెళ్లవుతుంది. ఆ ఇంజనీరూ, ఈ హరీషూ చిన్ననాటి స్నేహితులు. హనీమూన్ అయాక డ్యూటీలో జాయినవుతుంది నందిని. అయితే, వృత్తిధర్మానికీ గృహబాధ్యతలకీ మధ్య సంఘర్షణ ఏర్పడుతుంది. చక్కగా వండి వార్చి పెడుతూ, తను యింటికొచ్చేసరికి, తల నిండా పువ్వులతో పెదవులపై నవ్వులతో భార్య తలుపు తెరవాలని ఇంజనీరుగారి ఊహ. 'నాకు సంసారం ఎంత ముఖ్యమో, కష్టపడి చదువుకున్న వైద్యవిద్య కూడా అంతే ముఖ్యం,' - అంటుంది నందిని - అధునిక వనిత మనస్తత్వానికి అద్దం పడుతూ! లేడీ డాక్టరని మోజుపడి పెళ్లిచేసుకున్నాడే తప్ప, ఆమె దృక్పథం, మనోభిప్రాయం అర్థం చేసుకొనేందుకు ప్రయత్నించడు ఇంజనీరుగారు. ఒక్క సంవత్సరంలో జీవిత కాలానికి సరిపడ్డన్ని కష్టాలు పడి, వివాహ బంధం నుంచి వెలుపలికి వస్తుంది నందిని - పసిగుడ్డు తల్లిగా ! హరీష్ మరణించాడు, భర్త తననుంచి విడాకులు పొందాడు. తన కాళ్లమీద తను నిలబడి ఈ పసివాణ్ణి పెంచి పెద్దజేయాలి. జీవితం యింత క్రూరమా అనిపించే పరిణామాన్ని, ఆ ఛాలెంజిని, హరీష్‌కి ఒకనాడు తను బోధించిన ఛాలెంజే, తనే ఎదుర్కోవలసివస్తుంది. ఈ పాత్ర సృష్టి ఎవరు చేశారోగాని చాలా చక్కగా ఉంది ; అధునిక విద్యావతికి ఆత్మస్థైర్యం కలిగిస్తున్నది. సుహాసిని నటనా వైదుష్యంలో, నేటి వనిత మనోభావాలు వర్తిస్తున్నాయి. నిర్మాత యమ్మెస్‌రెడ్డి చాలా చక్కటి చిత్రాన్ని కన్నడనుంచి తెలుగులోకి తెచ్చారు.

## డ్రామా ఇంటర్ప్రేషన్
## 'నరసింహ'

వైకుంఠ ద్వారపాలకులైన జయవిజయులు, అహంకారమూ అజ్ఞానమూ వల్ల సనక సనందనాదులని అడ్డగించిన కారణంగా శాపం పొంది, హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగా, కశ్యప ప్రజాపతి భార్య అయిన దితిగర్భాన, అసుర సంధ్యవేళ ఆమెకి కలిగిన కామాతురత ఫలితంగా జన్మిస్తారు. ఆదివరాహంగాను, ఉగ్రనరసింహంగాను ఈ దైత్యులిద్దరినీ విష్ణుమూర్తి సంహరించవలసి వుంది. హరి సంకీర్తనతో ప్రహ్లాదుడూ, హరిద్వేషంతో హిరణ్యకశిపుడూ యిరువురూ హరివైపుకే పయనిస్తూ వుంటారు. 'నీ కుమారుని ఏ దివ్యశక్తి కాపాడుతున్నదో తెలుసుకోలేని అజ్ఞానాంధకారమే నిన్ను దహించివేస్తున్నది - నిన్నెంకెవరూ కాపాడలేరు' - అని చెబుతుంది దితి, తన కుమారుడైన హిరణ్యకశిపునితో. దితిగా కాంచన, లీలావతిగా సరిత తమ పాత్రలకు విశిష్టత చేకూర్చారు.

# "నా జీవితమే నా సందేశం"

సత్యం
అహింస
శాంతి
ప్రేమ
సహనం
నిర్భయత
సమానత
నిరాడంబరత
స్వదేశీ

గాంధీజీకి, అవి కేవలం మాటలు, చిహ్నాలు మాత్రమే కాదు. వారి ప్రతి చర్యకి, ప్రతి పనికి, అవి గీటురాయి. మానవ విలువలకు దిగ్దీపికగా. అది వారి జీవితాన్ని మార్చివేసింది. వారి ప్రతి మాట, వాస్తవానికి, ఒక సందేశం

మనలని ఎల్లప్పుడూ
ప్రేరేపించే ఒక సందేశం



అసుర చక్రవర్తి పాత్రకు రాజకుమార్ ఔన్నత్యం తెచ్చాడు. క్రయిమూ, వైలెన్సూ సెక్సూతో విసుగెత్తిపోయిన ప్రేక్షకులకు ఈ చిత్రమొక మలయ సమీరం. పౌరాణికగాథ అయినప్పటికీ రసబంధురంగా ఉంది.

## ప్రక్కాట్ వారి 'యాత్ర'

స్కూలు పిల్లలు హాలిడేకి టూరిస్ట్ బస్‌లో ఒక హిల్ స్టేషనుకి వెళ్తున్నపుడు, కొండదారిలో కల్వర్ట్ మీద కూచున్న ఒక మధ్య వయస్కుడు- గెడ్డం బాగా పెరిగి బూచాడిలా వున్న మనిషి - బస్సు ఆపమని కోరుతాడు. పది అడుగులు ముందుకివెళ్ళి, వెనక్కి వస్తుంది బస్సు. ఫాదరూ టీచర్లూ పిల్లలూ ఈ ఆగంతుకునికి సీటిస్తారు. కాసేపయాక, కథేమిటని అడుగుతారు. ఇతను చెప్పడం మొదలుపెడతాడు. జాలిగాథ వింటూ కొందరు పిల్లలైతే, ఏడ్చేస్తారు.... ఉన్నికృష్ణన్ ఫారెస్ట్ రేంజర్ - సుమారు ముప్పయ్యయిదేళ్ళ వాడు. ఈపాటికి యిద్దరు పిల్లలతండ్రి అయివుండవల్సిందిగాని ఎందుకనో పెళ్ళిచేసుకోలేదు ఆ అటవీగ్రామంలో తులసి (శోభన) అనే అమ్మాయి, ఈ ఉన్నికృష్ణన్‌కి (మమ్ముట్టి) చేరువవుతుంది. తులసి తండ్రి తాగుబోతు. వర్గన్యాయరీత్యా కృష్ణన్ చదువుకున్నవాడు; వారు పేదరికంలో మగ్గుతున్న గిరిజనులు. ఉన్నికృష్ణన్, తులసిని పెళ్ళిచేసుకొనేందుకు నిశ్చయించుకుంటాడు. తనవాళ్లతో చెప్పి వచ్చేందుకు పట్నం వెళతాడు. ఆ పట్నంలో యితనిని 'తీవ్రవాది'గా అనుమానపడి పోలీసులు అరెస్ట్ చేస్తారు. తీవ్రవాదులని అణిచేందుకు ప్రభుత్వాలు పోలీసుశాఖకు కొన్ని ప్రత్యేకాధికారాలిచ్చిన కారణంగా - విద్యావంతుడూ ప్రభుత్వోద్యోగి అయిన ఉన్నికృష్ణన్- వారి రాక్షస క్రీడల మధ్య నలిగిపోతాడు. తిరగబడి తప్పించుకొనేపోరాటంలో ఒక కానిస్టేబుల్ శిరసు గోడకేసి కొడతాడు. ఆ కానిస్టేబుల్ మరణిస్తాడు. ఇతను తీవ్రవాది కాదనీ, ఫలానా ఫారెస్ట్‌రేంజరని రుజువైనప్పటికీ హత్యానేరాభియోగం తప్పదుకదా! తమవాణ్ణి చంపిన మనిషిని పోలీసులు వొదిలిపెడతారా? తొమ్మిదేళ్ల జైలు శిక్ష పడుతుంది. ఆ శిక్ష అనుభవించి యింటికి వస్తున్నాడితను. వేయిదీపాలు వెలిగించి ఎదురుచూస్తూ వుంటుంది తులసి....కిరాతక నీతే తప్ప మనుజనీతికి చోటులేని జైలు దృశ్యాలని బాలూమహేంద్ర చాలా దయనీయంగా చూపారు. కొన్నిచోట్ల 'అతి'గా వున్నదని అనిపించినప్పటికీ, నక్సలైట్ల పేరిట అమాయకులు ఎలా బలి అవుతున్నదీ, మనిషిలో పరివర్తన తెచ్చే బదులు నేటి జైలు వ్యవస్థ మనిషిని మరింత మృగంగా ఎలా మారుస్తున్నదీ వీటిని నిశిత విమర్శనా దృష్టితో చిత్రీకరించారు దర్శకులు బాలూమహేంద్ర. నిర్మాత: జోసఫ్ అబ్రహమ్.

## కృష్ణ చిత్రావారి 'వందే మాతరం'

బంకిమ్ చంద్ర భారతమాతని మనసులో పెట్టుకు, 'అనందమఠ్'

నవలలో వ్రాసిన గీతిక 'వందేమాతరం' - అంటే 'మాతా, వందనములు' అని అర్థం. ఈ శతాబ్ది మొదటి దశకంలో, వంగవిభజనను ప్రతిఘటించే ఉద్యమంలో, ఈపాట మంత్రవాక్యమయింది; బ్రిటిష్ పాలకుల చెవులకు కర్ణకఠోరమూ రాజవిద్రోహకరమూ అయింది. రాజభక్తి శూన్యతనే దేశభక్తి అని న్యాయశాస్త్ర సూక్ష్మాలు కూడా పలికాయి. భారత స్వాతంత్ర్య పోరాట కాలంలో 'వందేమాతరం' అని నోటితో పలకడమే నేరం. లక్షలాది అహింసా వీరులు ఆ మధురాక్షర నినాదంతోనే జైళ్లకు వెళ్లారు ఆ 'వందేమాతరం' అనేమాటని ఈ నిర్మాతలు 'వందే-మాతరం' గా పలుచుకున్నారు. గోవిందయ్య, ఈశ్వరప్పల కంటె తమతరానికి ఎంతో నిజాయితీ వున్నదని చెప్పడం సత్యం (రాజశేఖర్), శాంతిల (విజయశాంతి) లక్ష్యం. అతను ఎమ్ఎ బిఇడీ పాసై, వల్లభపురం తాటాకుల పాకస్కూలుకి హెడ్మాస్టరుగా వచ్చాడు (ఉన్నది మరొక్క టీచరే - సాక్షి రంగారావు). ఆమె (విజయశాంతి) బొంబాయిలో మెడిసిన్ చదువుకు, బాబాయి గారింటికి వచ్చింది - పేరు: శాంతి. పల్లెటూరి పెద్దలిద్దరూ, తమ స్వార్థం కోసం ఊరుని రెండుగా చీల్చడం, బడి పిల్లలతోసైతం ఆ విషబీజాలు నాటడం. తమ అహం, అధికారం తప్ప పేదల గోడు పట్టించుకోక పోవడం, ఊరు బాగుచేదామని వచ్చిన వారి రక్తం చూడటం - ఈ వరవడిలో కొన్ని డజనుల చిత్రాలు చూసివుంటాం. అయితే, భిన్నమైనదేదో చెప్పాలనే ప్రయత్నం, కనిపిస్తున్నది. నాయనమ్మ (నిర్మల) మాణిక్యం (పిఎల్ నారాయణ), డప్పు వాడు (సుత్తి), ఈ మూడు పాత్రలూ, 'మూరులను మార్చలేవమ్మా' అనే బాబాయీ ఈ చిత్రకథకు ప్రాణం పోస్తున్నారు. నాయికా నాయకులవి చిరపరిచిత డ్రీమ్ సీక్వెన్సులూ, ప్రేమ పాటలూ, ఫార్ములా సన్నివేశాలూను. వల్లభపురం నుంచి, పడుగురాళ్ల నుంచి, గుంటూరు జిల్లా కలెక్టరు దగ్గిరికి ఈ పిల్లలందరినీ, ఊరువారి ప్రమేయం లేకుండా, సత్యం శాంతీలు ఎలా నడిపించుకు వెళ్లగలిగారు? అలాగే, ట్రాక్టరు తోలే ఈశ్వరప్ప కొడుక్కీ, సత్యానికీ మధ్య ఆ మహాయుద్ధమేమిటి? పాఠాలు చెప్పడమేగాక బాహువిద్యా పారంగతుడై వుండాలా పల్లెటూరు వెళ్లదలుచుకున్న టీచరు? నొప్పులు పడుతున్న స్త్రీని గతుకుల రోడ్లో రెండెడ్ల బండిమీద వర్షం వేళ. వర్షం హోరున పడుతూండగా తీసుకువెళ్తుందా మెడిసిన్ చదివిన అమ్మాయి? 'ఆ స్త్రీ అలా మరణించింది గనకనే శాంతికి గర్భస్రావం కలిగింది; ఊరు ఒకటిగా వుండేందుకు తన ప్రాణాలు దారపోసింది' - అని 'కర్మసిద్ధాంతానికి' ఆ పాత్రని కట్టేయవచ్చు. ఏ కళారూపమూ వాస్తవికతాక్షేత్రం నుంచిగాని పుష్పించదు. స్కూలు టీచరుని ఉద్యమకర్తగా ఊరంతటినీ తన విద్యార్థులకోసం ఏక తాటిమీద నిలపదలుచుకున్న ఉత్తమునిగా చిత్రించదలుచుకున్నప్పుడు, నిశిత సామాజిక పరిశీలనతో ఆ పాత్ర

మలవాలి. శాంతిరాగానే, దృష్టి ఆమెపై మళ్లుతుంది; ఆ సెక్రెటరీకి వేరో పార్టీ తరపు రాడాన్ని వేయడానికి జయమాలినీ అనూరాధలు రావడంతో కథ కంచి కెళ్లినట్లే!.... తప్పువానిపాత్ర చిత్ర మంతటికీ గొప్పగా ఉంది. చక్రవర్తి సంగీతం బావుంది. పాటలూ మాటలూ రసవత్తరంగా ఉన్నాయి. నటన విషయంలో అందరూ చక్కగా వేశారు. కథలో అతికిపోయే హ్యూమర్ అనేక చోట్ల నవ్విస్తుంది. దర్శకత్వం: టి కృష్ణ. నిర్మాత : హరికృష్ణ.

## 'ఎఆరార్' వారి 'ఇల్లాలికో పరీక్ష'

ఈ చిత్రంలో ఇల్లాలు ఊర్వశి శారద. ఆమె పరీక్ష ఎలాటిదంటే, యిటు కొడుకుని కాపాడటమా, అటు భర్తని రక్షించుకోవటమా ? మోహన్ బాబు ద్విపాత్రాభినయ చిత్రంలో, ఈ మనస్సంక్షోభాన్ని సినెమిటిక్‌గాను, డ్రమెటిక్‌గాను సస్పెన్స్‌తో పోషించారు. చిన్నపిల్లల ప్రశ్నలో, చిక్కుముడి విప్పడం లాటిది అయినప్పటికీ, ఆ ముడి విప్పడంలో పెద్దలు సైతం పాలొంటారు. ఈ పిక్చర్‌లో గల ప్రత్యేకత అదొక్కటే! యమ్‌బిఎ చదవడానికి అమెరికా వెళ్లిన కృష్ణ (మోహన్‌బాబు) నేర పరిశోధనలో శిక్షణ పొంది, ఇండియా వచ్చి, ఎయిర్ పోర్టులో పోలీసుశాఖనుంచి పూలమాల లందుకోవడం ఎంత అసందర్భమో, జైలునుంచి తప్పించుకొన్న సర్వారాయుడు (మోహన్‌బాబు), సవతైన పెద్ద కాల వ్యవధిలో యుజుహరాల నీతి నియమాలతో కోటీశ్వరుడై, 'యముడు' గా ధర్మ సంస్థాపనను చూపుకోవడం కూడా అంతే! మన ఆర్థిక వ్యవస్థలో, మన టాక్సేషన్ విధానంలో, నల్ల ధనమూ అక్రమమార్గమూ ఆశ్రయించకుండా కోటీశ్వరుడవగలగడం ఒక్క సినిమాల్లోనే సంభవిస్తుంది. 'ముందు కొచ్చి ముద్దుపెట్టు .... పక్కమీద చోటుపెట్టు' అనే భానుప్రియ, 'మారు మనువు కెళ్లింది మండపేట'కి అనే అనూరాధ, సగటు సినిమాకి కావల్సిన శృంగార లీలనిపోషిస్తున్నారు. ఫైట్స్, విభ్రమ గొలిపే విద్యుత్ పరికరాలు, యముని రహస్య స్థావరం, పరిగెత్తే కారులో హీరోగారి సాహస కృత్యాలూ – యిలాటివన్నీ వున్నాయి. అయితే, ఊర్వశి శారద, తండ్రీకొడుకులుగా మోహన్‌బాబు, తమ అపూర్వ నటనా కౌశలంతో ప్రేక్షకులని మెప్పిస్తారు. తండ్రీ కొడుకులిరువురూ ధర్మానికి కట్టుబడ్డ వారవడంచేత, చట్ట విరుద్ధంగా నడిచినందుకు న్యాయాధీశుడు (జివిజి) సర్వారాయునికి మూడు నెలలు విడిఖైదు విధించడంతోసర్వం గంగా ప్రవాహంలో కొట్టుకుపోతుంది. దర్శకత్వం: తాతినేని ప్రసాద్. నిర్మాత: రామచంద్రరాజు.

## రాశీ వారి 'మహారాజు'

మర్నాడు శతదినోత్సవ మనగా చూపించారు మద్రాసులోని పత్రికల

వారికి ఈ చిత్రాన్ని. ప్రారంభ దృశ్యాలూ చివరి ఘట్టాలూ మినహాయిస్తే, చిక్కరెంతో పొందికగా, రసభూయిష్టంగా ఉంది. గొప్పవాడైన రాంబాబునీ, కాఫీకప్పులు మోసిన రాంబాబునీ, ఒకే ఋజురేఖలోనాక స్మృతిమాలగా చూపివుంటే, యింకా రక్తిమ చేకూరేది. ఆర్థికశక్తి మనుషుల ప్రవర్తనను ఎలా శాసించేదీ వాస్తవికతతో, సమాజ దర్పణ న్యాయంతో చిత్రీకరించారు దర్శకులు విజయ బాపినీడు. నిజాయితీపరుడైన తండ్రి, రోడ్డు ప్రమాదంలో మరణించగా, ఏడెనిమిదేళ్ల రాంబాబుపై కుటుంబభారం పడుతుంది. తల్లీ, ఇద్దరు తమ్ముళ్లూ, ఒక చెల్లెలు. తండ్రి పనిచేసిన కంపెనీలోనే ఈ బాలునికి, ఉదారుడైన యజమాని (జగ్గయ్య) ఉద్యోగమిస్తాడు. శోభన్‌బాబు రాంబాబుగా పరిచయమయేనాటికి, తల్లి మరణిస్తుంది; తమ్ముడూ చెల్లెలూ కాలేజీ చదువుకొస్తారు; చిన్నతమ్ముడు పియుసి. ముగురూ మూడు విధాల రాంబాబుని పీడిస్తూంటారే తప్ప, అతని కష్టనిష్ఠూరాలు తెలుసుకునేందుకు వారి పరిధి అంగీకరించదు. తన శక్తికి మించిన చదువులు చెప్పించడం ఒకవిధంగా దౌర్బల్యమయినప్పటికీ, అది తన బాధ్యతగా భావిస్తాడు. చెల్లెలు ఒక భాగ్యవంతుని ప్రేమిస్తుంది; వారి పెళ్లి ఖర్చుకయే పదకొండు వేలలోను అయిదువేలు తక్కువ అవటంవల్ల, ఆ అయిదువేలూ కట్నంగా పొందేందుకు, పిల్లనికూడా చూపిస్తుండగా పెళ్ళిచేసుకుంటాడు రాంబాబు. ప్రతీ ఏడుస్తుండగాని ఫలం దక్కదు; కట్నమిస్తారని చెప్పిన మధ్యవర్తి (నూతన్‌ప్రసాద్) 'మ్మెమ్మెమ్మా' అంటాడు. పొలగ్గానుతో పడకగదిలోకి వచ్చిన ఆ వధువుని (సుహాసిని) నానా మాటలూ అంటాడు: స్నేహితుని మందలింపు కారణంగా మనసు మార్చుకుంటాడు. వొదినగారు యింట్లో పాదం పెట్టినప్పట్నుంచీ, చెల్లెలికీ తమ్ముళ్లకీ ఆమె మీద అక్కసు; అన్నయ్యని ఆమె లాగేసుకుందని! సైకలాజికల్‌గా కొంతవరకూ సమర్థనీయమైనా, అది అతిగా సాగింది. తలకు మించిన అప్పులు చేస్తాడు రాంబాబు; రెక్కలొచ్చిన తమ్ముళ్లిద్దరూ వెళ్లిపోతారు. చెల్లెలు చులకనగా మాట్లాడుతుంది. పేదరికం నుంచి పారిపోవడమే ఆమె ధ్యేయం. ఈ మహాంధకారంలో తోడునీడ లక్ష్మి. రాంబాబులోని ఔన్నత్యాన్నిఆత్మగౌరవాన్ని, బాధ్యతా భావాన్ని చూడగలిగినది ఆమె ఒక్కర్తే. ఇంతటి మమతగల హృదయమే నిన్ను మహరాజుని చేస్తోంది - అంటుందామె. మమతా పాశమొక్కటే రాంబాబుని కట్టివేసే లౌకికబంధం. ఇద్దరు పిల్లల్ని తనకు వొదిలి, మంటలలో మరణిస్తుంది లక్ష్మి.... తన అనుభవాలనీ జీవిత సారాన్నీ మాటలలోకి మార్చి చెప్పే రచయిత రాంబాబు, అఖిల భారత ఖ్యాతి నొందుతాడు. పై చదువులకు తన పిల్లలను విదేశాలకు పంపుతాడు; తను ఐశ్వర్యవంతుడవగానే చెల్లెలూ, తమ్ముళ్లూ మళ్లీ తన

దగ్గిరికి వస్తారు. కాని, ఏ పదివేల రూపాయిల ఇన్సూరెన్స్‌తో, దీనంతకీ విత్తనం నాటింవో ఆ లక్ష్మీ మాత్రం గోడమీద పటమై, హృదయంలో దీపమై, లోటకం అగిపోయేదాకా వెలుగుతుంది .. శోభన్‌బాబులో ఎందరో యువకులు తమ ప్రతిరూపం చూసుకుని వుంటారు; సుహాసిని, ఎందరో స్త్రీలకు కన్నీళ్ల తెప్పించి వుంటుంది - ఆ కన్నీటి చెంతులలో వారి జీవనఛాయలు తళుక్కుమని వుంటాయి. రాంబాబా, సోంబాబా అని మధనపడ్డ విజయ (స్వప్న), సగటు యువతిని సాక్షాత్కరింపజేసింది.... ఈ కుటుంబ గాధా చిత్రాన్ని తెలుగు వారు నూరురోజులు ఆదరించారూ అంటే, అందులో ఆశ్చర్యమేమీ లేదు. అంత పటుతరమైన పాత్ర సృష్టి. అభినందనీయమగు కృషి చేశారు దర్శకులు విజయబాపినీడు. నిర్మాత: యమ్ నరసింహారావు.



ఎవరెవరు? ఏ చిత్రంలోనిది ఆ వేషధారణ? సరిగా చెప్పగలిగిన మొదటి ఇరువురికీ పదేసి రూపాయలు బహూకరించగలము. ఎక్కువ మంది చెప్పగలిగినప్పుడు చీట్లువేసి మొదటి ఇరువురికే బహుమతి యివ్వడం జరుగుతుంది. మీ జవాబు కార్డుమీదనే వ్రాయండి. మాకు అందవలసిన చివరితేది: 10-12-1985.

JAGATI - 2, Kutchery Road, P B 2922, Madras - 600 004

సీరియల్

# ఆనంది

## అన్నపూర్ణా రెడ్డి

గడిచినకథ: భర్త తరపు బంధువు మన్‌మోహన్ వల్ల, గృహచ్ఛిద్రానికి లోనైన ఆనంది, స్నేహితురాలు వైదేహి దగ్గిర ఆశ్రయం పొందింది. కేరళకు వైద్య నిమిత్తం వెళ్లిన అత్తమామలు తిరిగొచ్చారు. స్టేషన్‌లోనే అడిగారు ప్రభుని కోడలెక్కడ?- అని.... ఇక చదవండి

వినగానే హడావుడి పడుతూ సామాను డిక్కీలో సర్దాడు. ముగ్గురూ కూర్చున్నారు.. టాక్సీ కదిలింది. మధ్యలో ఒకరితో నొకరు మాట్లాడుకోలేదు... ఇంటి ముందాగిన టాక్సీ లోంచి దిగి, తాళం తీసి సామాను లోనికి చేరవేస్తూంటే, మూసిన తలుపుల వంక, దుమ్ముకొట్టుకుపోయిన వరండా, రంగ వల్లులేక బోసిపోయిన ముంగిలి వంక అనుమానంగా చూస్తూ "ఆనందీ, పాప ఏరీ?.. ఎక్కడి కెళ్ళారు?...." పరశురామయ్య కొడుకును నిలదీశాడు.

"ఊరెళ్ళారు!" ముభావంగా బదులిచ్చాడు. 'ఎన్ని రోజులైందేమిటి?' 'మీరటు వెళ్ళగానే'

అంటీ ముట్టనట్టున్న ఆ జవాబులను వింటూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు పెద్దవాళ్లు.

'మేము వస్తున్నట్టు ఉత్తరం రాయలేదూ!. .... వెంటనే బయలుదేరి రమ్మని టెలిగ్రామ్ ఇవ్వు !.... ఇల్లంతా బోసిపోయింది !.' మౌనంగా తండ్రి హుకుం విని అవతలికి వెళ్ళిపోయాడు ప్రభాకర్.

"ఏమండీ!" పిల్చింది సుగుణమ్మ. ఏమిటన్నట్లు చూశాడు పరశురామయ్య.

'వీడేమిటోగా వున్నాడు-పెళ్ళయాక ఆనంది పురిటికి మినహా పుట్టింటికి వెళ్ళి ఇన్నిరోజులు వుండడం ఎప్పుడైనా ఎరిగున్నామా? అసలు వీడు, ఆ అమ్మాయిని వదలి ఒక్కక్షణం వుండలేడు కదా ? .... అడుగుతూంటే తగినంత కారణం చెప్పడు!'- అనుమానంగా భర్త వంక చూచింది.

'నీ బాధ్యత లేదు కదా - విశ్రాంతి కోసం వెళ్ళిందేమో?' సాలోచనగా అన్నాడు పరశురామయ్య.

"మరి వీడికి తిండితిప్పల్లేకుండా పోవడం లేదూ?"

"చూడవోయ్ పడుచుజంట అప్పుడప్పుడు ఇలా వియోగాలు కల్పించుకుంటే తప్ప ప్రేమకు పదును పెరగదు!"

"చాలా ఏళ్ళతరువాత కనుగొన్న

ట్టున్నారే ఈ సత్యాన్ని"-ఆమె కళ్లల్లో కొంటెతనం ....

"చాలు సుగుణా!.. ఆ రోజుల్లో నిన్ను కూడా అప్పుడప్పుడు మీ ఇంటికి పంపాలని అనుకొనేవాణ్ణి కాదూ? ఒక అరగడియమైనా నీవు లేకుండా నాకు గడిచేదికాదు పిచ్చెక్కినట్టయ్యేది!.. " సుగుణమ్మ భుజంమీద చేయివుంచాడు పరశురామయ్య.

ఆచేతిమీద తన చేయి వుంచింది సుగుణమ్మ. ఆ దంపతుల మనసులకేదో సంకేతం అస్పర్శ ద్వారా అందింది. వెంటనే దూరంగా జరిగి పోయాడు పరశురామయ్య.

"మన జాబు చూచుకొని అయినా అమ్మాయిని రమ్మని వ్రాయవచ్చుగా వెళ్ళి చాలా రోజులైంది, రాలేదని కినుక అయివుంటుంది. భార్య ముఖం లోకి చూచి నవ్వాడు పరశురామయ్య.

రెండు రోజులు బడలిక తీర్చుకొని మూడవ రోజు వ్యాహ్యాళికి బయలు దేరాడు పరశురామయ్య. దారిలో వ్యాహ్యాళి దోస్తీ శ్రీపతి కలిశాడు. యోగ క్షేమాలయ్యాయి. ప్రయాణపు విశేషాలు, కొట్టాయం విశేషాలు మాట్లాడు కొంటూ అలా పార్కుదాకా వెళ్ళి బెంచీ మీద కూర్చున్నారిద్దరూ.

మాటల మధ్యలో....

"ఏమిటి పరం.. అబ్బాయి గురించి ఈ మధ్యవీధిలోవారు నాలుగు రకాలుగా అనుకొంటున్నారు" అన్నాడు శ్రీపతి.

మనసులో చెలరేగిన భావాలను తొక్కిపట్టి నవ్వుతూ "ఏమిటట?" అన్నాడు. "ఆ!.... అదే.. అమ్మాయిని పుట్టినింటికి పంపేసి.. ఎవరో.. స్నేహి తుడి చెల్లెలిని తెచ్చి పెట్టుకున్నాడని!" కళ్ళకు కట్టిన గంతల్ని విప్పేసినట్టి అనుభూతి.... అయినా బింకంగా, ఉన్న మాటేకదా? - అంటూ పెద్దగా కుతూహలం చూపకుండా మాట దాటించేశాడు పరశురామయ్య.

'అయితే నీకూ తెలుసా?'

'తెలియక పోవడమేమిటి - వాళ్ళు అప్పుడప్పుడు వచ్చి, నాలుగు రోజు లుండి వెళ్తొంటారు.... ... ఈ మధ్య వీలుపడక కొంతకాలంగా రాలేదు....'

"అట్లా చెప్పు. ఏమిటో మనుష్యుల తత్వం...... విషయం ఒకటైతే దానికి కలరింగ్ ఇచ్చి మరోటిగా తేల్చి చూపి సారు." కొట్టిపారేశాడు శ్రీపతి.

కాస్సేపు రాజకీయాలు చెప్పుకొని ఇంటి ముఖం పట్టారిద్దరూ.

ఇంట్లో అడుగుపెట్టేసరికి పరశు రామయ్య ముఖంలో తీవ్రత చోటు చేసుకుంది.

రాత్రిభోజనాలయ్యాక ముగ్గురూ హాల్లో కూర్చున్నారు. కాస్సేపు పిచ్చా పాటి అయ్యాక, "కోడలికి టెలిగ్రామ్ ఇచ్చావురా అబ్బాయ్!" అడిగింది తల్లి.

ముఖంలోమొలకెత్తినవిసుగుదలను దాచుకుంటూ "ఇవ్వలేదు!" అన్నాడు.

"అదేం?" ఆశ్చర్యంగా కొడుకు వంక చూచింది.

"ఆవిడే వస్తుందిలెద్దూ!"

"అబ్బాయ్!" అప్పటిదాకా మౌనం గా వున్న పరశురామయ్య పిల్చాడు. తలెత్తి చూచాడు ప్రభు.

"ఏం జరిగిందేమిటి?" సూటిగా అడిగాడు.

"... .. ...."

"మాట్లాడవేం!"

"ఏముంది మాట్లాడానికి ?"

"మరి ఏం లేకపోతే అడిగిందానికి సమాధానం చెప్పవేం!"

"కోడలు కోడలని మీరు ప్రాకులాడ్డమే కానీ, ఆకోడలికి ఈ ఇంటిపట్ల పిసరంతైనా గౌరవం లేదు."

"ఏం జరిగిందయ్యా.... పెద్ద పెద్ద మాటలంటున్నావు?" సుగుణమ్మ ముఖంలో ఆందోళన ప్రస్ఫుటమైంది.

తల్లి ముఖంలోకి క్షణకాలం చూచి ఇక దాచి లాభం లేదనిపించింది.

"ఏముందమ్మా .... నాపాటికి నేను ఆఫీసుపట్టుకు, తిరుగుతూంటే, ఇంటిపట్టునతను ఛీ! ఛీ! ....నానోటితో చెప్పలేను" విసురుగా లేచి కిటికీ చెంతకు వెళ్ళి నుంచున్నాడు.

"అంత చెప్పకూడని పనేం చేసింది?"

"నీతి బాహ్యమైన పనులు చెప్పలేను"

"అబ్బాయ్, చూడూ.. మనిషి జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు నీతిబాహ్యమైన పనులు చేస్తూనే వుంటాడు. కొందరు తెలివి తెచ్చుకొని సర్దుకుంటారు.. మరికొందరు అందులో మునిగి వెలికిరాలేక కొట్టుకులాడినా ఎవరో ఒకరి చేయూతతో గట్టెక్కేస్తారు. మరి కొందరు మాత్రం అందులోనే అధఃపతనమై పోతారు. ప్రతి మనిషికీ ఎదురయ్యే సమస్యలే" అన్నది సుగుణమ్మ.

"మీరలా వెళ్ళగానే....మనూ వచ్చి ఇక్కడ తిష్టవేశాడు. బంధువని అయినా గౌరవం లేకుండా వాడి ఆకర్షణలో పడిపోయింది తిడతాడు!"

భార్యా భర్త లిద్దరూ ఒకరినొకరు చూసుకొంటూ మిన్నకుండిపోయారు.

"ఈవిడ అందాన్ని అతగాడు వర్ణిస్తూంటే ఆవిడ పరవశత్వము...ఛీ!ఛీ!"

"ఆల్ రైట్ మై సన్. నీవన్నదాన్ని నేనూ సమర్ధిస్తాను ... కానీ ఇందాక అన్నావు ఓ మాట....ఆకర్షణ అని, స్త్రీ పురుషుల మధ్య ప్రథమంలో కలిగేదే ఆకర్షణ! కానిది అది చాలా సూపర్ ఫిషియల్ వ్యవహారం. కొంతకాలం పాటు అంటిపెట్టుకున్న ఆ ఆకర్షణ, రోజులు జరిగేకొద్దీ మంచులా విడిపోతుంది. లేదూ ఒకవేళ ఆకర్షణ బలపడి మరోమెట్టు ముందుకెళ్ళిందీ అనుకో ఆ సంబంధం కూడా అట్టే నిలువదు.... శారీరిక సంబంధం తరువాత ఒకరినొకరు ముఖాలు చాటు చేసుకుంటారు. లేదా దుయ్యబట్టుకొంటారు. అసహ్యించుకొని దూరమైపోతారు. మనూ లాంటి వ్యక్తి ఈలాటి వ్యవహారానికి ప్రోత్సహించినా, ఆనంది లాటి వ్యక్తిత్వమున్న స్త్రీ ఎప్పుడూ తప్పటడుగు వేయదు. ఆమాత్రం నమ్మకం నాకుంది."

తండ్రి వంక సుదీర్ఘంగా చూచి, "ఎవరి చాదస్తం వారిది, సరే మీ నమ్మకం మీది".... అంటూ గిరుక్కున వెనుతిరిగి తన గదిలోకి వెళ్ళిపోయాడు.

పెద్దవాళ్ళిద్దరూ స్తబ్దంగా అక్కడే కూర్చుండిపోయారు.

* * *

రెండురోజుల తరువాత బయలుదేరి అనంతపురం వెళ్ళాడు పరశురామయ్య.

వియ్యంకుడి ఇంటిముందు రిక్షాదిగి చిన్న చేతిసంచితో లోపలికి వెళ్ళాడు.

ఆనంది తల్లి ఎదురొచ్చింది.

"ఎన్నాళ్ళకెన్నాళ్ళకు? రండి రండి అన్నయ్యగారూ. అంతా కులాసానా?" ఆప్యాయంగా పలుకరించింది.

కుర్చీలో కూర్చొని కండువాతో ముఖాన్నావరించిన స్వేదాన్ని తుడుచుకొంటూ 'మేము కులాసానే....మీరు కులాసానా?' పలుకరించాడు.

గ్లాసు నిండా చల్లని మంచి తీర్థం అందిస్తూ ఆ 'అంతా కులాసానే" మా వదినగారి ఆరోగ్యం బావుందా కేరళ వెళ్ళారని వ్రాశారామధ్య - ఎప్పుడు తిరిగొచ్చారు?'

అన్నిటికీ ఓపికగా బదులిస్తూనే గ్లాసు ఖాళీచేసి, నేలమీదుంచి, కండువా కొసతో మూతి తుడుచుకొని, లోపలికి తొంగిచూచాడు - తన గొంతు విన్నాక కోడలి అలికిడి అవుతుందేమో అని !

"అల్లుడుగారూ, అమ్మాయి, మనవరాలు బావున్నారా?.. ఈమధ్య అసలు ఉత్తరాలు లేవు!" గుమ్మాన్నానుకొని నుంచుని అడుగుతున్న వియ్యపురాలిని గుడ్లప్పగించి చూడసాగాడు పరశురామయ్య. అతడి మస్తిష్కం చురుగ్గా పనిచేయసాగింది.

ఆనంది గురించి అడుగుతోంది అంటే, ఆనంది ఇక్కడికి చేరలేదన్న మాటేకదా!.... ఎక్కడికి వెళ్ళింది?.... అసలే అభిమానవతి. వెంటనే తేరుకుని, "ఆ! ఆ!... అంతా కులాసాగానే వున్నారు.." అన్నాడు!

(ఇంకావుంది

# పసిడి పలుకులు

మన బ్రతుక్కి ఒక ఉద్దేశం, ఒక లక్ష్యం కల్పించబడితే గాని అది జీవిత మనిపించుకోదు. —రాఫెల్

మనసుని అర్థసంపదతో గాక ఆత్మ వైశాల్యంతో మాత్రమే జయించగలము. —స్పినోజా

మనసుని దౌర్జన్యంతో గాక సత్వగుణంతో కట్టేసేవారినే మనం పూజనీయులుగా భావిస్తున్నాం. —వాల్టే

ప్రేమతో అందరినీ జయించలేకపోవచ్చు కాని ప్రేమగల హృదయం సమస్తం స్పష్టంగా చూడగలుగుతుంది. —బ్లాక్

ఈ లోకంలో ఎవరు సుఖజీవనులు? భయాలు వీడి, ఆత్మగౌరవాన్ని నిలబెట్టుకోగల ధీరులు. —పాటర్సన్

ఈ స్కూలు పాఠాలు నా అసలు చదువుని చెడగొట్టలేకపోయాయి.

—మార్క్ ట్వేన్

రచయిత కాదలుచుకున్నవాడు అరిస్టాటిల్ సలహా పాటించడం ఎంతైనా అవసరం - మేధావుల పద్ధతిలో ఆలోచించి సామాన్యుల భాషలో చెప్పగలగాలి. —యాశ్బమ్

మన రాజకీయ స్వాతంత్ర్యం ఒక గమ్యం కాదు - అది ఒక మార్గం మాత్రమే! ఆ మార్గం ద్వారా మన సాంస్కృతిక విమోచన జరగాలి. మన సంస్కృతికి జీవధాతువులు ఉపనిషత్తులలో వున్నాయి. —రాధాకృష్ణన్

JAGATI Telugu Monthly - Vol. 31 No. 354 - Dec. 85

Edited, Printed and Published by N. R. Chendur at

MANASA PRESS, 2- Kutchery Road, Madras-600 004

Phone : 76697